దేశీ ప్రచురణలు

ప్రథమ ముద్రణ

వెల రూపాయి

ఆగష్టు — 48.

Published for Kisan Publications

Printed at Kisan Press, Bezwada.

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

రైతు వుద్యమమునందుండే మమకారముతో
రైతాంగ గ్రంథమాలకు విరాళములిచ్చిన పెద
పాడు రైతుబిడ్డలకు ఈపుస్తకము సమర్పించ
బడినది.

రంగ

## రైతు గ్రంథములకు రంగాగారిద్వారా విరాళములిచ్చిన
## పెదపాడు రైతులపేర్లు



1 గారపాటి చినకనకయ్యగారు
2 గారపాటి వెంకటేశ్వరరావు యం. ఎ.
3 గారపాటి వెంకటకృష్ణయ్య
4 గారపాటి సీతారామస్వామి
5 గారపాటి పెదకనకయ్య
6 పాలడుగు లక్ష్మీనారాయణ
7 మూల్పూరి సుబ్రహ్మణ్యం
8 మోటూరి రామకృష్ణయ్య
9 కుకునూరి వెంకయ్య
10 అల్పాటి వెంకటరత్నం
11 కట్నేటి వెంకటప్పయ్య
12 అక్కినేని అప్పారావు
13 చిన్నమనేని వీరరాఘవయ్య
14 మిక్కినేని వెంకటరత్నం
15 కొత్తపల్లి పాపారావు
16 సీమకుర్తి అప్పారావు
17 చిన్నమనేని నాగయ్య
18 నర్రా వీరరాఘవయ్య
19 గారపాటి నారాయణ
20 దేవగాహగల గంగరాజు

# మహదభిప్రాయ పంచకము

ప్రపంచమంతటి దృష్టిని ఆకర్షించిన మహదభిప్రాయము లైదు. రాజకీయ పక్షములు, వాటి సిద్ధాంతములు యిందేదో ఒక్కదానినైన అనుసరించియే వుండును.

ఏమా అభిప్రాయములు?

జాతీయత, ప్రజాస్వామికము, సామ్యవాదము, విప్లవము, అహింస.

జాతీయత : ఈ రెండవ ప్రపంచ సంగ్రామం నాటివరకు పాశ్చాత్య సోషలిష్టులు, సోవియట్ కమ్యూనిష్టులు జాతీయతా పటిమను పూర్తిగ యెరుంగలేరు. జాతీయదశ నతిక్రమించినట్లే వారు భావించారు. కాని యీద్వితీయ ప్రపంచ సంగ్రామం 'జాతీయతా' ప్రభావమును మరొక్కమారు ప్రపంచమునకు బయల్పరచింది అఘాధమైన జాతీయతత్వం ప్రజల రక్తములో యింకి వుంది. పారిశ్రామికముగ పురోగమించిన, సామ్యవాదము సంస్థాపనమైనా, జాతీయత రూపుమాయదు. జర్మనీ మెరుపు యుద్ధంధాకకు రష్యా తట్టుకోగల్గినా, బాంబులజ్వాలతో భస్మీకృతపట్టణమౌతున్నా బ్రిటన్ ధైర్యం మొక్కపోలేదంటే ఆ యా దేశీయుల జాతీయతే ముఖ్యకారణం. ప్రజలన్ను ఉత్తేజపరచి, సంగ్రామోత్సాహం కలించుటలో ఆ దేశాల రాజకీయజ్ఞుల ఉపజ్ఞకు జాతీయతే మూలాధారం ఇక జాతీయ స్వాతంత్ర్యమును సాధించుకోదలచిన పతితప్రజలు, జాతీయోత్తేజితులౌతున్నందుకు సిగ్గుపడనవసరంలేదు. దేశస్వాతంత్ర్యసాధనకు, సంరక్షణకు విద్యుల్లతవంటి, ఉత్కృష్టమైన సాంఘిక విప్లవశక్తియే జాతీయత.

సామ్యవాదము: ప్రపంచప్రజలు, ముఖ్యముగ పతితప్రజలు, తమ దైనందిన అవసరముల నీడేర్చుకొనుటలోను, స్వరాజ్యసంపాదనా ప్రభుత్వములందు, సోషలిస్టు మార్గావలంబకులు గాకుండ వుండగలరా? సామ్రాజ్య వ్యతిరేక జాతీయపోరాటం కొనసాగుచున్నంతకాలం జాతీయోద్యమునకు సోషలిస్టు ప్రసక్తియే వుండరాదని కొందరు సనాతనుల వాదం. కాని చైనా భారత దేశముల అనుభవము దానికి భిన్నముగ వున్నది. ప్రపంచసామ్రాజ్య

వాదము, విదేశీయసామ్రాజ్యతత్వములనుండి విముక్తినంది, సామ్రాజ్య ఆర్థిక దోపిడిని అంతమందించుటకు గడంగిన ప్రజలు జాతీయైక్యతా నిర్మాణము ద్వార, జాతీయ స్వాతంత్ర్య సంపాదనా ప్రయత్నములు నెరపుతునే, సోషలిస్టు దృక్పథము నలవరచుకొంటారని చైనా, ఇండియాల అనుభవము.

ప్రపంచధనికవాదము పెనుభూతముగ వ్యాపించిపతిత దేశాలలోగూడ మిత్రబృందమును యేర్పరచుకుంటుంది ప్రపంచ ధనికవాద పీడనమును అంతమందించుకొను మార్గాన్వేషణకై బయలుదేరు పతిత ప్రజలకు స్వదేశ ధనికవర్గముగూడ ప్రపంచ ధనికవర్గ భాగస్వాములుగ గోచరమౌతుంది. దాంతో జాతీయోద్యమానికు సామ్యవాద ప్రసక్తి ఆరంభమౌతుంది. ప్రజల ఆర్థిక అవసరముల నీడేర్చుటయందు జాతీయోద్యమాలు సోషలిస్టు మార్గమునునుసరిస్తాయి; సోషలిస్టు దృక్పథమును పెంపొందించుకుంటాయి. మహాత్మగాంధి, డాక్టర్ సన్‌యట్ సేన్ గారల అనుభవములు ఆవిధముగ సోషలిస్టుదృక్పథమునలవరచుకోవాలని సూచించు హెచ్చరికలే. గాంధిజీ "నేను సోషలిస్టును" అని బహిరంగముగ ప్రకటించాడుగూడ. అంతేగాక కమ్యూనిస్టు మూలసూత్రమునే ఆచరించ నారంభించాడు. "శక్తికొలది పని, అవసరంకొద్ది ఫలితం" అను మూలసూత్రమును తన ఆశ్రమంలో అమలు జరుపనారంభివాడు కమ్యూనిజం కోరినట్లు "స్వంత ఆస్థి" నీ వర్జించాడు.

**ప్రజాస్వామికము:** పతిత ప్రజలకు ప్రజాతంత్రం ప్రాణప్రదం వారి రాజకీయములకు ప్రజాస్వామికమే ప్రాణాధారం. ప్రత్యక్షముగ, పరోక్షముగ తమ్ముపీడించు సామ్రాజ్యవాద ఆధిపత్యమును, సామ్రాజ్యవాద మిత్రవర్గములైనజమీందారీ, షావుకారి, పెట్టుబడిదారీవర్గములను యెదుర్కొను పతిత ప్రజావిప్లవ వ[illegible]యుద్ధమే ప్రజాస్వామికము.

పతితప్రజ లాశించు ప్రజాస్వామిక స్వరూపమెట్టిది? ప్రజాతంత్రము పేలిముసుగుతో, ధనికవాద దోపిడి కవకాశమొసంగు అమెరికా బూటక ప్రజాతంత్రంగాదు. ఇంగ్లండులోవలె పతిత ప్రజలను, వ్యవసాయ ప్రజలను దోచుకుంటూ, విదేశాలపై సామ్రాజ్య ఆధిపత్యమును చలాయిస్తూ, స్వదేశంలోమాత్రం పారిశ్రామిక వర్గములను పోషించు దుష్ప్రజాతంత్రమును పతిత ప్రజలాశించరు.

సమగ్రమైన, స్వచ్ఛందమైన ప్రజాతంత్రమునే పతిత ప్రజలాశిస్తారు. ఏవిధమైన దోపిడీ విధానము చేతను మలినము గాని పరిశుద్ధ ప్రజాతంత్రమునే వారు పూజించుతారు. కార్మిక, కర్షక, శ్రామిక ప్రజలందరికి సమాన రాజ్యా

ధికారము నొనగూర్చు ప్రజాస్వామ్యమే వారి ఆశయం. కారల్ మార్క్సు కలలుగన్న ప్రజాస్వామికము, మహాత్మాగాంధి సూచించు ప్రజాతంత్రము, మెక్సికో అధ్యక్షుడు ప్రపంచ మంతా నెలకొనాలనే ప్రజాతంత్రము యిదే.

రైతుకూలీ శ్రామికప్రజారాజ్యంలో దోపిడి విధానంవుండదు స్త్రీలు పిల్లలకు రక్షణవుంటుంది హరిజనులు (ఇండియా) రెడ్ ఇండియన్లు, నీగ్రోలు (అమెరికా) ఇంటి పనివారలు (చైనా) యీనాటివలె, ఆరాజ్యంలో ఒకరి దయాధర్మాలకై నిరీక్షించవలసిన దుర్గతి వుండదు. జమీందారుల, పారిశ్రామిక యజమానుల దోపిడి తుడుచుకపోతుంది. "ఉత్పత్తి సాధనములు" అన్నియు, ముఖ్యముగ కీలక, భారీయంత్ర పరిశ్రమలు, బ్యాంకులు, భీమా కంపెనీలు మున్నగు ప్రధాన వ్యాపార సంస్థలు అన్నియు ప్రభుత్వముచే నడుపబడును. భూమిఅంతా ఐచ్ఛికముగ యేర్పడు వ్యవసాయదారులఉత్పత్తి సహకార సంస్థల సత్వమౌతుంది.

వ్యక్తులు మితిమించిన లాభాలు గడించుట, బస్తీ పెత్తందారుల సాంఘిక దురాగతములు, దోపిడి ఆసమాజంలో నిర్మూలింపబడును పరిశ్రమలు, వ్యాపారసంస్థలు అన్నికూడ, సమాజక్షేమానికి నిర్ణయమయ్యే పద్ధతిని, శ్రమజీవుల.చే నిర్వహింపబడు సహకార స్వపరిపాలకసంఘముల చేతుల్లోవుండును. గ్రామీణ ప్రాంతీయ స్వయం పోషకసూత్రముపై నడుచు ఆసమాజం జాతీయపెట్టుబడిదారీవిధానముపైగాని అంతర్జాతీయమార్కెట్లపైగాని ఆధారపడవలసిన అగత్యంలేదు ఆసమాజంలో యే ఒక్కవర్గదోపిడి ఆధిపత్యములకు ఆస్కారము లేనిరీతి అన్నిశ్రామికవర్గములకు సమిష్టి అధికారంగల ప్రజాస్వామికరాజ్యాంగం ఏర్పడుతుంది. ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని, ఏకవర్గఆధిపత్యము తలసూపరాదు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక ప్రజాస్వామిక స్వరాజ్యమే పతిత ప్రజల ఆశయం.

విప్లవము: చట్టబద్ధమైన మార్గములు మాత్రమే పైజెప్పిన ఆశయసాధనకు చాలవు రైతు, కూలీ, ప్రజారాజ్యాశయ సాధనకు విప్లవమువపరమే. కాని పోరాటం జాతీయదశలో వున్నంతకాలం దేశంలోని అన్నివర్గముల ఐక్య కృషి అవసరం. ఏ యే వర్గముల హక్కులు భంగపరచబడెనో, లేదా సంకుచిత పరచబడెనో ఆ వర్గములన్నియును, సామ్రాజ్య వాదాధిపత్యముచే అణచియుంచబడిన యితర జాతీయ వర్గములతో కలసి పోరాడవలసియున్నది. ఐతే జాతీయపోరాటంలో పాల్గొను అన్నివర్గములు ఒకే విధమైన విప్లవోత్సాహమును, విప్లవశక్తిని ప్రకటించలేవు.

భారతదేశంలో ప్రప్రథమంగా చదువుకున్న పై తరగతులవారు, పిమ్మట మధ్యతరగతి ప్రజలు జాతీయ చైతన్యం పొందారు. తర్వాతనే రైతులు, కార్మికులు చైతన్యంపొంది, విప్లవోత్సాహమును వెలిబుచ్చారు. ఈ విధముగ అన్నివర్గములను ఆకర్షించిన జాతీయోద్యమంలో నేడు రైతు కూలీ మధ్యతరగతి ప్రజలే ప్రముఖ భాగస్వాములైనారు

జాతీయ విప్లవంలో కార్మికులు అగ్రగాములుగారు గదా – వారికి తృతీయ స్థానమే లభించింది. సంఖ్యాధికులుగా నుండుటవల్లనేమి, ప్రభుత్వ 'లంచాలవిధానము' (అధిక వేతనబల, అధివెన్నలరూపేణా బుజ్జగించుట) కు లోనుగావటంవల్లనేమి, కార్మికవర్గ నియంతృత్వ సమ్మోహితులై విజాతీయ భక్తిగల్గిన దేశద్రోహకర పార్టీలకు బానిసలగుట వల్లనేమి, జాతీయోద్యమంలో యథోచితముగ పాల్గొనలేకపోయారు కార్మికులు. మనదేశంలోనే గాదు, చైనాలోనయింతే కమ్యూనిస్టుపార్టీ సమ్మోహితులై జాతీయైక్యతా విచ్ఛిత్తుకు కారకులయ్యారు. జపాన్ వ్యతిరేక ప్రతిఘటనాశక్తి సన్నగిల్ల చేశారు,

చైతన్యరహితులైన కార్మికవర్గం నియంతృత్వ వ్యామోహితులై వ్యాఘాతుక వైఖరి నవలంబించినను, ప్రాచీన వైజ్ఞానిక సత్సాంప్రదాయాలు, జాతీయ స్వాతంత్ర్యము పతిత ప్రజల మనోవీధిని వీడిపోవు. భారతదేశము, చైనా టర్కీ, ఐర్లండు, యీజిప్టు మున్నగు అనేక దేశములలో యిది వ్యక్తమైంది రైతులు అసంఖ్యాకులుగ జాతీయ విప్లవంలో పాల్గొన నారంభించుటతో, జాతీయ విప్లవం అణచరాని అగ్నిజ్వాల అయింది

పాశ్చాత్యులు, పారిశ్రామిక విధాన సమ్మోహితులు. యెన్ని ధర్మశాస్త్రాలను వల్లించినా రైతాంగ విప్లవశక్తి నెంత క్రిందుజేయ చూచినను, ప్రపంచ రైతులు ముఖ్యముగ పతిత దేశాల రైతాంగమే స్వాతంత్ర్యోత్తేజితులై, జాతీయ విప్లవోద్యమాలకు రూపురేఖల నొసంగారని లోకానికి విదితమైంది. రైతులు ప్రేమించు ప్రాచీన గ్రామీణ వ్యవస్థ నాగరికత వారి జాతీయ చైతన్యం పెంపొందుటకు దోహదకారియైంది. యూరప్‌లో కొన్ని దేశములలో తప్ప, ప్రపంచమందంతట రైతాంగము గ్రామీణ ఆర్థిక స్వాతంత్ర్యమును, రాజకీయ నాయకత్వమును చవిజూచినదే కావుననే ఏకవర్గ ఆధిపత్యముగాని సామ్రాజ్య పెత్తనంగాని వారికి దుస్సహము, రైతాంగ విప్లవ సంఘటనా శక్తికితోడు, గాంధీజీ వారిలో "ఆత్మస్వాతంత్ర్యము" నురేకెత్తిస్తూ, ఆత్మవిశ్వాసమును పెంపొందించాడు. కావుననే భారతదేశ రైతాంగం విప్లవాగ్రదశముగ విరాజిల్లుతోంది. పాశ్చాత్య పారిశ్రామిక శాస్త్రా

వరణంలో పుట్టిన కమ్యూనిస్టు సిద్ధాంతములకు యిది వెగటుగ కన్పించవచ్చు కార్మికవర్గ మొక్కటే విప్లవనాయకత్వం వహించి విప్లవాలను నడుపగల గ్రంథస్థ విప్లవకారులకు, కార్మికవర్గ నియంతృత్వాధికారులకు రైతుల, ధీశాలుర విప్లవపాత్ర యగోచరముగ వుండవచ్చు. వారి విప్లవశక్తియందు విశ్వాసంలేనందున, యీ విప్లవవర్గములను వారు తృణీకరించుచున్నారు.

గాంధీజీ ఒక్కడే శ్రామికవర్గములన్నింటి విప్లవశక్తిని గుర్తించాడు. కావున గాంధేయపథ మొక్కటే అభ్యుదయకరమైన, నిర్మాణాత్మకమైన, నిజమైన ప్రజాస్వామిక విప్లవపథమని ఘంటాపథముగ చెప్పగలను. 'దేశానికి రైతే జీవగర్ర' అని అంగీకరిస్తూ, అన్నివిధములైన దాస్యములను త్రెంచు రైతుల తిరుగుబాటుతత్వమును గుర్తిస్తూ వారి విప్లవశక్తి పెంపొందించుటకు గడంగాడు. గాంధీజీయే రైతాంగ విప్లవాగ్రగామిత్వమును నిర్మిస్తున్నాడనవలసి యున్నది.

రాజకీయముగ స్వాతంత్ర్యము కల్గియూ, అమెరికా, బ్రిటన్, రష్యాల ఆర్థిక సామ్రాజ్యతత్వమును, తమ్ముళ్ళమున పరోక్ష రాజకీయ దాస్యమునకు గురియైన దక్షిణ అమెరికా, బాల్కన్ రాజ్యాలలో గూడ కార్మికవర్గము గాక, రైతాంగమే విప్లవాగ్రదళమైంది. ఆదేశ రాజకీయములందు కార్మికులు గణుతింప తగినంత బలమును పొందలేదు రైతులే సుసంఘటితులై, చైతన్యవంతులై, రాజకీయములందు ముందంజవేశారు. ధీరోచిత త్యాగాలకు వెనుకాడని బాల్కన్ రైతాంగమును ఆదర్శ రాజకీయ, ఆర్థిక పంథాన నడుపు రాజకీయపార్టీలున్నాయి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో వజ్రాయుధమనదగు జాతీయత బాల్కన్ రైతుల పట్టుగొమ్మ. దీనికి తోడు ప్రక్కనున్న రష్యాలోని తమ సోదరరైతుల దురవస్థ వారిని ముందుగ మేల్కొల్పింది. కార్మిక నియంతృత్వచరిత్ర తమదేశంలో పునరావృతం గారాదని నిశ్చయించుకున్నారు. యీ విధముగ అన్ని వ్యవసాయిక దేశములలోను రైతులే విప్లవాగ్రగాములని నిరూపణయైనది. జాతీయవిప్లవము, సోషలిజములు రైతులకు అపరిచితము కాదు. పతిత దేశాలలో, వ్యావసాయిక దేశాలలో సోషలిజం స్థాపింపబడవలెనంటే విప్లవాగ్రగాములైన రైతులను, యితర విప్లవవర్గములైన కార్మిక, ప్రజావర్గములనుగూడ సంఘటితపరుస్తూ, విప్లవోద్యమానికి బలం సంపాదించుట పరమధర్మమే గాక ప్రథమావసరంగూడ.

జాతీయవిప్లవంలో శ్రామికవర్గములే గాక స్వలాభచింతనముతో ధనిక వర్గములుగూడ పాల్గొంటున్నాయి సహజంగా. పాల్గొని విప్లవఫలితము నను

భవింప జూస్తాయి. శ్రామికవర్గములుగూడ, ఏ వర్గానికావర్గం విప్లవఫలితమును తానే పొందజూస్తుంది. ఇది సహజవాంఛయే గావచ్చు. కాని ఏ ఒక్క వర్గ ఆధిపత్యమున్నా సత్ఫలితముల నొసంగదు. విప్లవఫలితం ధనికవర్గాల చేజిక్కకుండ శ్రామికవర్గములన్నియు సంఘటితము గావలసిన ఆవశ్యకత వుండనేవుంది. ఇదే విప్లవఫలితమును పొందుటలో సమాన భాగస్వామ్యమును దారితీయును, కావున శ్రామిక విప్లవమేదికూడ తనకు ఫలితం దక్కదను నిరాశతో, విప్లవవర్గములను వీడి, విప్లవ వ్యాఘాతమును తలపడరాదు. ఏ శ్రామికవర్గమున్నా విప్లవపోరాటమును దూరముగనైన వుండరాదు!

అహింస: అహింస మానసిక స్వాతంత్ర్యమును చేకూర్చు బలవత్తరమైన శక్తియని మహాత్మాగాంధి నిరూపించాడు. రాజకీయాశయ సాధనకు సైతం అహింస దివ్యాస్త్రమని, అనుభవపూర్వకముగ, లోకానికి ప్రకటించాడు. అంతర్విభేదములు, తొలగించుకొనుటకు, గూడ అహింస ప్రయోజనకరమైన సాధనం.

అనేక విప్లవములు హింసామార్గమున నడచి యుండవచ్చు. అనేక దేశములు హింసాప్రయోగంవల్ల జాతీయ స్వాతంత్ర్యము సాధించయుండవచ్చు కాని రెండు మహాసంగ్రామములను చవిజూచి, మారణాస్త్ర ప్రయోగముతో విసిగి, వేసరిన యీ ప్రపంచం హింసాప్రయోగము సరికట్టలేకపోయింది. మారణాస్త్రప్రయోగ పోటీని సమయింపలేకపోయింది పరస్పర విభేదములను సరిదిద్ది, సమరస్వభావమును సృజింపలేని హింసావిధానమునకే ఇంకా లోకం అలవడాలనడం చరిత్ర నేర్పు పాఠములను తృణీకరించాలనుటేగదా! కావుననే బహుళ ప్రజలు హింసావిధానంపట్ల విరక్తిని వెలిబుచ్చుచున్నారు.

ఐతే దేశాలమధ్య, జాతులమధ్య పొడసూపు ఘర్షణలు, ఆర్థిక, రాజకీయ పోరాటములు, రాయబారముల వల్లను, ప్రపంచ న్యాయస్థానముల తీర్పులవల్లను సవ్యముగ పరిష్కరింపబడక పోవచ్చునని గాంధీజి యెరుంగక పోలేదు. ఏ దేశమైన, జాతియైన, తనకు దురన్యాయము జరుగుచో, దాన్ని అంతమొందించుకొనుటకు 'పోరాటపంథా' ననుసరించవచ్చుననిగూడ గాంధిజీ గుర్తించాడు. ఐతే ఆ పోరాటము అహింసాత్మకమైనదిగ వుండవలెను.

'యుద్ధం పనికిరాదు' అను కెల్లోగ్ సంధి మాటలతో సంఘర్షణలు సమసిపోవుగదా? అన్యాయమునకు గురైయైన దేశంగాని, జాతిగాని అహింసాప్రపంచంలో ఆత్మార్పణకు సైతం వెనుకాడని బాధానుభవంద్వారా

ప్రపంచ హృదయధ్యానం, తనకు జరిగిన అన్యాయంపట్ల లగ్నమయ్యేట్లు చేయవలెను. ప్రపంచ సానుభూతి ప్రపంచప్రజల ఒత్తిడి తోడైయుండ, అంత మైతీరుతుంది.

రాజకీయపక్షముల అంతర్విభేదములుగూడ అహింసాప్రయోగంద్వార అంతమందించుకోదగును. ముందు, పార్టీలోని అన్నిబృందములు పరస్పర సహనమును పెంపొందించుకోవాలి మెజారిటీ నిర్ణయం పాటింపబడితీరవల సిందే. కాని అన్యాయకరమైన మెజారిటీ నిర్ణయమును రద్దుపరపించి అన్యాయము నంతమందించుటకు మైనారిటీపర్గము పూనుకోవచ్చు ఆ పరిస్థితిలో, సత్యాగ్రహప్రయోగంద్వారా, ప్రజల దృష్టిని, పార్టీసభ్యుల దృష్టిని అన్యాయమందించుచుట్ల లగ్నంచేసి, అన్యాయనిర్ణయం మార్చుకోదగును. హింసాప్రయోగముద్వారా పార్టీలు తమ అభిప్రాయ ప్రాబల్యమునకు పూను కొనుచో, ప్రమాదం ఘటిల్లితీరును రష్యాలో, జర్మనీలో కమ్యూనిస్టు, నాజీ పాలనములందు యెందరు అఖండమేధావుల నిండుప్రాణములు పండిపోలేదు? ఏకపార్టీ పరిపాలనమున్న దేశములో ముఖ్యముగ 'అంతర్విభేదములు' తొల గించుకొనుటకు అవశ్యం అహింసే ఆచరణీయం. లేకుంటే ఏరోజు ఏ మేధావి మరణం సంభవించునో! మేధావులను, ప్రజ్ఞానిధులను కాటుకంయేర్పడదని యెవ రైన హామీ యివ్వగలరా? రాజుల చిత్తములే క్షణభంగురము లన్నట్లు, దురన్యాయం నియంతల చిత్తములు నంతేగదా?

ఐతే అహింస మాత్రం సమగ్రమైనదా? ఆచరణీయమైనదా? అని ప్రశ్నించవచ్చు యీలోకంలో సర్వసమగ్రమైన దంటూ ఒక్కటిలేదు లోప మనునది సహజం. కాస్తోకూస్తో ప్రతి దానియందు కొంతలోపం వుంటుంది. కాని అహింసా ప్రయోగం లో కానికి బాధలేకపోగా, నష్టంలేకపోగా ఉప యోగకరమనీ, ఫలప్రదమనీ గత 25 సంవత్సరముల భారత జాతీయ విప్లవాను భవం నిరూపించింది ప్రమాదరహితమైన "అహింసాస్త్ర ప్రయోగ పరిశోధ నలు" నేల చేయరాదు. హింసపట్ల విసుగు విరక్తిగల యీ ప్రపంచం అహిం సాచరణకు గడంగ దగును.

---

# 2

## సోషలిజం అంటే యేమిటి?

అన్ని శ్రామిక వర్గముల, శ్రమ జీవులందరి క్షేమానికి, శ్రామికవర్గముల ప్రజాతాంత్రిక నాయకత్వముచే, శ్రమజీవుల ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక వికాసమును ఆచరింపబడు సామాజిక వ్యవస్థ సోషలిజం అనబడును.

సోషలిజములో ధనిక, జమీందారీ వర్గముల దోపిడీవుండదు. పరుల శ్రమను దోచుకొనగల 'స్వంత ఆస్తులు' వుండవు. కాని పరిమితమైన ప్రయివేటు ప్రాపర్టీ (స్వార్జితాస్తి) వ్యక్తుల అధీనంలో వుండదగును. దాని ఫలితమును వ్యక్తులు తమకుటుంబావసరములు పొందుటకుగా వినియోగించుకొనగును. సోషలిజములో యే ఒక్కరు గూడ నిరుద్యోగమునకు గురిగానవసరం లేదు. శక్తివంతులందరు విధిగా యేదో ఒకపనిలో నిమగ్నులై వుండాలి. వారి శ్రమకు తగిన ప్రతిఫలం లభించగలదు. ఏ శ్రామికునకు గూడ జీవనభృతికి చాలని వేతనం వస్తున్నదని కంప్లెయింటు చేయుటానికే అగత్యం లేనిరీతి, ప్రతివానికి కనీస వేతనము, ఉచిత విద్యాసౌకర్యములు, వృద్ధాప్యంలో ఉపకార వేతనము, సాంఘిక భద్రత గ్యారంటీ చేయబడును. సమాజంలో వ్యక్తుల మధ్య అంతరము తగ్గించి, సాధ్యమైనంతవరకు సమత్వము నెలకొల్పు దృష్టితో కనీస, గరిష్ఠ వేతనములు పరిమితిపరచబడును. జీవితావసరవస్తు సముదాయము అందరికీ సక్రమముగా అందించు రీతి పంపకవిధానము వుంటుంది.

రైతులకు, వ్యవసాయకూలీలకు కనీసజీవనభృతిని గ్యారంటీ చేయుటకు తగినట్లుగ వ్యావసాయికవస్తు సముదాయమునకు న్యాయమైన కనీసపు ధరల గ్యారంటీ వుంటుంది. వస్తూత్పత్తిదారుల ఐచ్ఛిక, సహకార పద్ధతిపై వ్యవసాయ వస్తూత్పత్తి, వినిమయవిధానము లమలు జరుగును 'తక్కువ ఖర్చులు, లాభములు-యెక్కువ ఫలితము' అను సూత్రముపైననే ప్రభుత్వము సహకార సంస్థలు వ్యక్తులు నిర్వహించు వ్యాపారవిధానము ఆధారపడి వుంటుంది.

కీలక పరిశ్రమలన్నియు, భారీ యాంత్ర పరిశ్రమలన్నియును ప్రభుత్వముచే నిర్వహింపబడును. ఆ యా పారిశ్రామిక సంస్థలలో పనిచేయు కార్మికులకును, పారిశ్రామిక ప్రణాళికానిర్ణేతలకును, ఆ యా పరిశ్రమలపై 'ధర్మకర్తృత్వము' వుండును.

పరిమితమైన (కుటుంబావసరములు) ఫలసాయము నొసంగు స్వంత కమతములను కారల్ మార్క్సు, ఎంగెల్సు గూడ అంగీకరించారు. దీనినే వారికమ్యూనిస్టు మ్యానిఫెస్టోలో "స్వంతఆస్తి" అని నిర్వచించారు. ఖర్చులు తగ్గించుకొని, ఎక్కువ ఫలసాయమును పొందుతలంపుతో, ఇట్టి చిన్న స్వంత కమతములన్నింటిని రైతులు ఒకటిగా చేసుకొని, ప్రజాతంత్ర యుక్తమైన సహకార పద్ధతిని, సమిష్టి వ్యవసాయమును సాగించుకోదగును. బంజరుభూములను భూమిలేని వ్యవసాయ కూలీలకు, కుటుంబావసరములకు సరిపడని ఆదాయముపొందు చిన్నరైతులకు సహకార పద్ధతిని సాగుకొసంగబడును. లేదా ప్రభుత్వమే ఆ భూములను సాగుచేయించదగును.

పరిశ్రమలు, వ్యవసాయం, వ్యాపారంమున్నగు ఏవృత్తిలో పనిచేయు వారి శ్రమనైనను సమానముగ పరిగణించి, సాధ్యమైనంతవరకు వారివారి శ్రమకు సమానమైన విలువనే కట్టవలెను. శాస్త్రవిజ్ఞానం సమాజమంతటికి చెందును. కాని ఏ ఒక్క వర్గమునకు, బృందమునకు, శాస్త్రపరిజ్ఞానము గుత్తయై ఉండదు. పాశ్చాత్యసోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంతముల సూత్రములు, సోవియట్ రష్యా అనుభవమును విస్మరించలేము. వారిసూత్రములు, అనుభవములలోని లోపములను సరిదిద్దుకుంటూ, అన్ని శ్రామికవర్గములకు సమానావకాశము, సమానాధికారముల నొసంగు సిసలైన సోషలిజమునే మనం ఆశించుతాం; ఆరాధించుతాం ఈ దృష్టితో పరిశీలించుదాం. కాంగ్రెసులో సోషలిజం వున్నదీ లేనిదీ పరికించుదాం. సోషలిజము ననుభవించుచున్నదనబడు రష్యాతో కాంగ్రెస్ తత్వమును పోల్చుదాం

| సోవియట్ రష్యా | కాంగ్రెస్ తత్వం |
| --- | --- |
| 1. దోపిడీ విధానం రూపుమట్టించబడెను. దోపిడీ వర్గము లంతమొందించ బడెను. | 1 దోపిడీని, దోపిడీ విధానమును అంత మొందించ నిశ్చయించుకున్నది. |
| 2 కీలక పరిశ్రమ లన్నింటిని ప్రభుత్వము నిర్వహించును. | 2 కాంగ్రెసు కూడ దీనినంగీకరించింది. (ఎన్నికల ప్రణాళిక) |
| 3 అందరకు పనికల్పించుచున్నది తదనుగుణ్యముగ పరిశ్రమలన్నీ, | 3 అందరకు పని గల్పించుటే కాంగ్రెసు అభిమతమే ఐతే మన ఆర్థిక సంపత్తికి అందుబాటులో వుండు |

వ్యవసాయమును యంత్రమయం చేస్తున్నది.

4. ప్రణాళికలు అవసరం గుర్తించి అమలు జరుపుతున్నది.

5. ప్రతివానికి కనీస జీవన భృతి గ్యారంటీ వుండాలి.

6 కార్మికవర్గము మాత్రమే సంఘాలు పెట్టుకోవచ్చును.

7. రైతులకు,మధ్యతరగతి ప్రజలకు రాజ్యాంగంలో ప్రాధాన్యం లేదు. కార్మిక వర్గనియంతృత్వమే వుంది.

8 నూటికి 25 గురు మాత్రమే వున్న కార్మికులే ప్రధానులు

9 సోషలిస్టు సమాజంలో గూడ అందరకు సమాన జీతనములుండవు. కనీస జీతనములను పెంచుతూ, గరిష్ట జీతనములను పరిమితి పరుస్తూ మధ్య అంతస్తును తగ్గించును ఆర్థిక సమానత్వము నంతముంచించుట కిదొక ముఖ్యమార్గం.

10 స్త్రీలకు సమాన హక్కులుండును

11. క్రొత్తలో సాంసారిక జీవనముపట్ల ఏవగింపుకనపరచింది పెండ్లి సాస్థను చులకనగ యెంచి, వైవాహికులుగా నుండగనే సంసార

చేనేత పరిశ్రమ, గృహ పరిశ్రమలను అర్గనైజ్ చేస్తుంది.

4 ప్రణాళికల ఆవశ్యకతను గుర్తించి, 1938 లోనే నేషనల్ ప్లానింగ్ కమిటీని వేశారు.

5 ఈసూత్రమును కాంగ్రెసు అంగీకరించింది. చరఖా (సంఘం వేతనాలు పెంచుట చెరఖా ధరల పెంపకము)

6. కార్మిక సంఘములే గాక అన్ని వర్గసంఘములు ఏర్పడవచ్చును.

7. అన్ని శ్రామిక వర్గములకు సమాన భాగ ముండాలి కాని కార్మికవర్గముకు గాని, మరేవర్గము, వర్గములకు గాని నియంతృత్వముండరాదు రైతు కూలీ, ప్రజావర్గముల ప్రజాతంత్ర రాజ్యమేయేర్పడాలి.

8 నూటికి 80 మందిగ వున్న రైతులు ప్రధానము.

9 గాంధిజీ గూడ దీనిని గుర్తించారు, మధ్య అంతస్తును తగ్గించు తలంపుతోనే కనీస గరిష్ట వేతనములను పరిమిత పరచింది. ఆర్థిక అసమానత్వ అంత ముందించుట గాంధిజీ నిర్మాణకార్య క్రమంలో ప్రధాన భాగం.

10. స్త్రీలసమానత్వమును గుర్తించింది

11. భారత జాతీయోద్యమము మొదటినుండి సాంసారిక జీవితము యొక్క విలువను గుర్తిస్తూ వచ్చింది. ప్రాచీన సాంప్రదాయ

సౌఖ్యము ననుభవించుట నేరముగ యెంచలేదు. సంతాన నిరోధమును ప్రోత్సహించారు. విడాకులు తేలికగ లభించేట్లు చేసారు. కాని యుద్ధావసరంలో యీ తప్పిదములను గ్రహించి సాంసారిక జీవితమును గౌరవించ నారంభించింది. వైవాహిక జీవితమును ప్రోత్సహిస్తూ, గర్భస్రావములు చేసుకొనుటను నిషేధించింది. విడాకుల విషయంలో కఠిన వైఖరిని ప్రచార పరచింది.

12. "శక్తి కొలదీ కృషి, అవసరం కొద్దీ వినియోగం" అను కమ్యూనిస్టు సూత్రముపట్ల ప్రజలు ఇంకను విముఖులుగనే వున్నారు "శక్తి కొలది శ్రమ శ్రమకుతగిన ప్రతిఫలం" అను సోషలిస్టు సిద్ధాంతముతోనే తృప్తి చెందుచున్నారు.

13 వ్యవసాయమును గూడ యంత్రమయం చేసి, రైతాంగమును కార్మికులుగ మార్చి ఆహార, వస్త్రోత్పత్తి కర్మాగారములనే నెలకొల్పాలని రైతువర్గమును అంతమొందించాలని ఆశ. కాని యీ ఆశ యీడేర లేదు.

14. బస్తీలకు, పరిశ్రమలకు, గ్రామాలు, రైతాంగము లోబడి వుండాలి బస్తీ నాగరికత ప్రధానము. బస్తీలకు గ్రామాలకు మధ్య చాలా తారతమ్యం చూపబడుతున్నది.

ముల ప్రభావమును పోనాడలేదు! కుటుంబమునకు విలువగలదని గుర్తించింది అసహజ,కృత్రిమ సంతాన నిరోధము 'పాపము' అన్నాడు గాంధిజీ. విడాకులహక్కు గుర్తించినను ప్రబల కారణములున్నపుడే విడాకులు.

12 'శ్రమకుతగిన ప్రతిఫలం' అను సోషలిస్టు సూత్రమును కాంగ్రెస్ అంగీకరించింది.

గాంధీజీ కమ్యూనిస్టు సూత్రమును, 'ఆశ్రమం'లో అమలుజరుపుతూ, సుముఖ వాతావరణం కల్పిస్తున్నాడు.

13 గ్రామీణ, రైతాంగ నాగరికతను నాశనం చేయలేదు అధునిక ప్రపంచపరిస్థితుల కనుగుణ్యంగ వ్యవసాయ రంగంలో మార్పులు తీసుకరాతగును. రైతువర్గం నాశనం గాకపోగా, దినదినాభివృద్ధి చెందుతుంది. విశిష్టమైన గ్రామీణ నాగరికతఅంతమందదు.

14. బస్తీల వునికిని గుర్తించక పోలేదు. గ్రామాలకు బస్తీలకు మధ్య వైజ్ఞానిక స్థాయిలో జీవితసరళిలో వుండు తారతమ్యమునుగూడ గుర్తించింది. ఐతే బస్తీలు

15. కార్మికవర్గ దృక్పథము తో ప్రపంచ పరిస్థితులను తిలకిస్తూంటూంది కార్మికవర్గముకే ప్రపంచము అనుభోగ్యం గావాలంటుంది.

16 సమిష్టి వ్యవసాయ క్షేత్రము తో వుండాలి. రైతాంగ సానుభూతి లేనందున, రైతాంగం కోర్కెల ప్రకటనకు అవకాశంగూడ నొసంగదు. నిర్బంధ పరచిరైన సమిష్టి వ్యవసాయ క్షేత్రముల నేర్పరచుటే ఆశయం. మాటలలో మాత్రమే రైతుల సహకారత్వమును స్టాలిన్ అంగీకరించాడు. కార్మిక తత్పరతే గాని, రైతాంగ తత్పరత లేదు సైనిక బలంతో రైతువర్గము నణచి వెట్టారు లక్షల రైతులను హింసించారు. ఈ దమన నీతికి నిరసన సూచకముగ 'వుత్పత్తి నిరోధక సమ్మె' జరపిన రైతులకు శిక్షలు విధించి, కాంసెంట్రేషన్ క్యాంపులకు పంపారు. గ్రామాలనుండి రైతాంగమును, బస్తీలకీడ్చి, ఫ్యాక్టరీలలో "నిర్బంధ చాకిరీ" కిలాను చేశారు. యంత్రపారిశ్రామిక దృక్ప

ఇప్పటివలె, దోపిడి విధాననిర్వహణకు నిలయములుగ గాక, గ్రామాల మధ్య, గ్రామాభ్యుదయ దృష్టితో, సంబంధ మేర్పరచు కూడలిస్థలములుగ మాత్రమే బస్తీలుండాలి గ్రామజీవితాని కనుగుణ్యంగానే బస్తీలుండాలి.

15. రైతు, కూలి, ప్రజావర్గముల సమిష్టిదృక్పథముతో ప్రపంచ పరిస్థితులను వీక్షిస్తుంది శ్రామికవర్గములన్నింటికి ప్రపంచం అనుభోగ్యంగావాలి.

16. సమిష్టి వ్యవసాయ పద్ధతి యొక్క విలువను, గుర్తించింది. రైతాంగముపట్ల, రైతాంగ కోర్కెలపట్ల సానుభూతిగలదు. రైతులు అభిమతము అంగీకారము పైన మాత్రమే సమిష్టివ్యవసాయ క్షేత్రముల నేర్పరచాలి. బలవంతము, నిర్బంధము పనికిరాదు అనుభవపూర్వక సత్ఫలితముల ప్రదర్శనము ద్వారా, రైతులను సహకార వ్యవసాయపద్ధతికి ప్రోత్సహించవలెను. రైతాంగతత్పరతవుంది. అభిప్రాయ ప్రకటనకు అవరోధము లుండవు. దౌర్జన్యకాండ నింద్యము. గ్రామీణ వ్యవసాయిక దృక్పథమును ప్రధానముగ నెంచుతుంది. కాంగ్రెసుది అహింసాత్మకమైన రైతాంగానుకూలవైఖరి.

ధము నే ప్రధానముగ రొంచిన ఫలితము యిదంతా. ఒక్క మాటలో చెప్పాలంటే హింసాత్మకమైన రైతాంగ వ్యతిరేకవైఖరి రస్తాది.

17. దారిద్ర్యము, నిరుద్యోగము, నిర్మూలించుతుంది కార్మికవర్గ ఆధిక్యతాదృష్టి గల్గియున్నందున, యంత్రోత్పత్తినే అవలంబించుతుంది యంత్రనాగరికతను పెంపొందించుతుంది; కావున గృహపరిశ్రమలంటే అయిష్టం.

18 విద్యా విధానము యంత్రపరిశ్రమల కనుగుణ్యముగ వుండాలి బాల్యంనుండి యంత్రమయ సాంకేతిక విద్య నేర్పబడును పిల్లలను సత్ప్రవర్తకులు విద్యావంతులుగ, ఆరోగ్యవంతులుగ జేయాలి.

19. మానవసౌభ్రాతృత్వము, అంతర్జాతీయత అలవరచుకొంటుంది.

17. దరిద్రము, నిరుద్యోగము వుండరాదు; గ్రామీణ నాగరికత, చేతిపరిశ్రమలు దీనికి ప్రధాన సాధనములు శక్తికి మించిన శరీరకష్టమును తప్పించుటకే యంత్రములు పయోగించుకోదగును. కావున ప్రతిదానికి యంత్రముతే వుండరాదంటుంది.

18. విద్యావిధానము గ్రామనాగరికత కనుగుణ్యముగా ఉండాలి. సాంకేతిక విద్యావిధాన ప్రాధాన్యతను గుర్తించింది కావున నే వార్ధా విద్యావిధానం వస్తోంది. పిల్లలను ఆరోగ్యవంతులుగ, సత్ప్రవర్తకులుగ, విద్యావంతులుగనే గాక, మానవ సమాజమున కుపయుక్తులుగ వుండురీతి శిక్షణ నొసంగాలి

19 ప్రాచ్య సోషలిస్టులకు, మానవ సౌభ్రాతృత్వము, అంతర్జాతీయత క్రొత్త గాదు. మన ప్రాచీన విజ్ఞానము ఒక్క మానవులనే గాక, సకల జీవరాసులను, సమానముగ, సాదరముతో చూడవలెనని చూచిస్తున్నది. ఈవున్న తాకాయుంగస్యా కింకను క్రొత్తగ నేవుంది.

అంతర్జాతీయతా వ్యామోహితమై, జాతీయతను 'సంకుచిత జాతీయ వాదం' అని తూలనాడిన రష్యా, యుద్ధకాలంలో (1941) జాతీయప్రభావమును గుర్తించింది. అంతర్జాతీయతనే (1943లో)వర్జించి అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీనే అంతమందించింది అంతర్జాతీయ గీతమును వదలి, జాతీయగీతమును పాడనారంభించింది కాని కాంగ్రెసు జాతీయతను గాని, అంతర్జాతీయతను గాని తూలనాడలేదు. జాతీయతా పునాదులపై అంతర్జాతీయతను నిర్మించబూనుకుంది. పతిత ప్రజల ప్రాపంచికోద్యమ నిర్మాణమును గడంగినది

పాశ్చాత్య సోషలిస్టులకు కొన్ని రకములైన దోపిడి విధానముతో రాజీవున్నది. కార్మికవర్గమును, పారిశ్రామిక యజమానవర్గములు దోపిడి చేయుటనుమాత్రమే దోపిడివిధానముగ గుర్తించారు అంతేగాని 120 కోట్ల రైతాంగమును, 40 కోట్ల పారిశ్రామిక ప్రజలు, పారిశ్రామిక విధానము దోపిడి చేయుటను గమనించరు. కాంగ్రెసు అన్నిరకముల దోపిడికిన్నీ ప్రబల శత్రువు. అన్ని రకములైన దోపిడి విధానములకు మూలమైన 'ప్రాతిపదిక దోపిడి' యనబడు 120 కోట్ల రైతాంగమును 40 కోట్ల పారిశ్రామిక ప్రజలు చేయుచున్న దోపిడి అంతమై తీరాలంటుంది. ధనికవర్గముయొక్క వునికి గుర్తించిందే. గాని ధనికులు సమాజక్షేమమునకు లోబడి, తమ ఆస్తులపై 'ధర్మకర్తలుగా' మాత్రమే వుండదగును. ధర్మనిర్వహణం సక్రమముగ లేదని తోచినపుడు, ప్రజలు అహింసాత్మక పద్ధతిని (సత్యాగ్రహం) ధర్మకర్తృత్వమునే అంతమందించుకొనగును. అంతేగాని ధనికవర్గ ప్రాబల్యమునంతమందించుటకు పాశ్చాత్య సోషలిస్టులవలె 'దౌర్జన్యం'పై ఆధారపడరాదు.

వ్యవసాయ దేశములకు, పారిశ్రామిక వ్యాపార దేశములకు మధ్య ప్రపంచసంపద న్యాయముగ పంపిణీ జరగాలి దీనివల్లనే నిజమైన సోషలిజం నెలకొనవీలగునని నెహ్రూజీ, గాంధీజీ, సన్ యెట్ సేన్, బాల్కన్ రైతు నాయకులు గుర్తించారు. అట్లే జాతీయ సంపదగూడ రైతాంగము, పారిశ్రామిక ప్రజలమధ్య సక్రమముగ, న్యాయముగ పంపిణీ గావాలి. ఈ ప్రాతిపదిక సూత్రమును, రైతాంగవ్యతిరేక ధోరణి ననుసరించు సోవియట్, పారిశ్రామిక సోషలిజం గుర్తించదు కావుననే వ్యవసాయ వస్తువులకుచౌకధరలు, పారిశ్రామిక యంత్రోత్పత్తి వస్తువులకు ప్రియమైనధరలు రష్యాలో వున్నాయి. ఈతారతమ్యముపైననే సోవియట్ పారిశ్రామిక ప్రణాళికలు ఆధారపడి వున్నాయి.

కరాచీ ప్రాథమిక హక్కుల ప్రణాళిక, ఫైజుపూర్ అగ్రేరియన్ ప్రోగ్రాం, గాంధిజీ నిర్మాణ కార్యక్రమము, కాంగ్రెసు యెన్నికల ప్రణాళిక, నేషనల్ ప్లానింగుకు నెహ్రూ సోషలిస్టు సమన్వయం, రైతు, కూలీ, ప్రజారాజ్యమే కాంగ్రెసు ఆశయం అను గాంధిజీ ప్రకటన మున్నగునవన్నియూ కాంగ్రెసులో సోషలిజం దినదినాభివృద్ధినొందుచున్నట్లు వ్యక్తపరుస్తాయి. ఐతే కాంగ్రెసు సోషలిజం 'పాశ్చాత్య పారిశ్రామిక సోషలిజం' గాదు. రైతు కూలీ ప్రజావర్గ సంయుక్తాధికారముగ, అన్నివిధములైన దోపిళ్లను అంతమొందించు అహింసాత్మక, వ్యావసాయిక ప్రాచ్య సామ్యవాదమే కాంగ్రెసు అనుసరించు సోషలిజం.

---

# 3

## కాంగ్రెసు పరిణామం

ఆదిలో బ్రిటిష్ అధికృతకు లోబడిన సురాజ్యమునే కాంగ్రెసు ఆశించింది. 1906లో కలకత్తా కాంగ్రెసులో భారతజాతీయోద్యమ పితామహుడు దాదాభాయ్ నౌరోజి మొట్టమొదటిసారిగ "భారతీయుల ఆశయం స్వరాజ్యం సాధించుట" అని ప్రకటించాడు. నాటిదనుక, భారత రాజకీయజ్ఞులకు యూరపియన్ రాజ్యాంగ విధానము మాత్రమే ప్రమాణముగ వుండినది. 1920లో గాంధిజీ భారత రాజకీయరంగమందు ప్రవేశించి "స్వరాజ్యమంటే రామరాజ్యమ"ని అర్థం చెప్పాడు. ప్రజలవూహకు అందుబాటులో వున్న "రామరాజ్య"మను ప్రయోగం జాతీయ చైతన్యం పెంపొందింప జేయుటకు జరిగినదే గాని, 'ఏకమతస్థ రాజ్యసంస్థాపనమ'ని భ్రమపడుట తగదు.

సౌఖ్యప్రదమైన, అభ్యుదయదాయకమైన జీవిత సరళికి ఆధారభూతమైన బాధ్యతాయుత జాతీయ నాయకత్వమును చేకూర్చు సురాజ్యమే రామరాజ్యమనీ, భారతదేశమంతటినీ రాజకీయముగ సమైక్యపరచి, ప్రజాభిప్రాయ ప్రకటన కవకాశమొసంగుచు, ప్రభుత్వాధికారులను సైతము ధర్మబద్ధుల జేయు సురాజ్యమే రామరాజ్యమనీ యీనాటికిని అందరు హిందువు

లేగాక, కోట్లకొద్ది హిందువులు కానివారు గూడ విశ్వసించుచున్నారు. ఇట్లు రామరాజ్యనిర్వచనం ద్వారా స్వరాజ్య సౌధ స్వరూపమును ప్రజల కందించుచున్నాడన్నమాట.

రామరాజ్యంలో గూడ దుష్టశక్తులు లేకపోలేదు. అప్రజాహిత రాజరికము కూడ, కొన్ని దుష్ట శక్తుల ప్రభావమునకు లోనుగా లేదనలేము. కాని యీనాటి ప్రజలస్మృతిలో రామరాజ్యము యొక్క దుష్టత్వం లేనేలేదు. ఒక మతము యొక్క సర్వాధిపత్యము భావనాంతమున నుండేలేదు గాంధీజీ నిర్వచనంలో రామరాజ్యమంటే "పౌరాణిక రామరాజ్య అనుకరణము గాక ప్రజల మనసులో హత్తుకుపోయిన సురాజ్యమను భావం" వ్యక్తమైవుంది. 1920లోనే రామరాజ్య పదప్రయోగం ప్రారంభమైనా, 1934 లోగాని 'రామరాజ్య స్వభావము'ను జనాన్ని శంకించలేదని పేర్కొనుట అప్రస్తుతంగాదు.

ఐక్య బెంగాల్ వుద్యమం (1907) దక్షిణాఫ్రికాలో గాంధీజీ సత్యాగ్రహవిజయం, తిలక్ గారి 'స్వరాజ్యం నా జన్మహక్కు' అన్న నినాదము... ఇవన్నియు బస్తీప్రజలలోను, విద్యాధికులందును జాతీయ చైతన్యమును పెంపొందించాయి. ప్రథమ ప్రపంచసంగ్రామంగూడ జాతీయ చైతన్యవ్యాప్తికి తోడైంది. 1916 — 19 మధ్యకాలంలో, అనిబిసెంట్ సాగించిన హోంరూల్ వుద్యమం జాతీయ చైతన్యపూరితులైనవారికి సంఘటనా కేంద్రమైంది. విప్లవ భావముల నా వుద్యమం రగుల్కొల్పింది

అమృతసర్ దురంతాలు, రౌలత్ అక్టులతో జాతీయ నిరసన వెల్లివిరిసింది. దేశమునకొక విప్లవసంస్థ, విప్లవనాయకుడు, విప్లవ సిద్ధాంతము, విప్లవాస్త్రము కావలసివచ్చాయి. గాంధీజీ సత్యాగ్రహాస్త్రము, అనుచరులను క్రమశిక్షణతో నడుపగల ఆయన శక్తి, ఆయన సామ్రాజ్యతత్వ వ్యతిరేకత, ప్రజల నుత్తేజపరచు ఆయన వాక్పటిమ, మానవరక్తమును మారణహోమముల కాహుతిగాపోయు వాళ్ళకోదు పాశ్చాత్య నాగరికతపట్ల ఆయన ప్రాతికూల్యము ఇవన్నిగూడ ప్రజలచే కొనియాడబడెను. విజయోన్మత్త బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక విప్లవసాధనకాయనమార్గమే శరణ్యమని యెంచి గాంధీజీ నాయకత్వమును వరించారు.

కాశీవిశ్వవిద్యాలయ శంకుస్థాపనోత్సవ సభ (1917) యందు వన నిష్యూ "రాజాల, జమీందారుల భాగ్యభోగ్యములన్నియు రైతుల కష్టఫలితమే

వనియు, రాజుల కిరీటములపై అమర్చబడిన వజ్రాలు, రత్నాలు అన్నియు కూడ శ్రమజీవుల రక్తస్రవంతి చిహ్నములేననియు, రాజులు తమ బొక్కసములోని డబ్బును స్వప్రయోజనములకు గాక, ప్రజాప్రయోజనములకే వెచ్చించవలెననియు" గాంధిజీ హెచ్చరించాడు. నాటి గాంధిజీ వుపన్యాసమునకు రాజులు నిర్ఘాంతపోయారు. నిరసన సూచకముగ కొందరు సభాస్థలమునే వదిలారు. ఆ వుపన్యాసము రాజులకే గాక, జాతీయవాదులైన మాళవ్యా, అనిబిసెంట్ ప్రభృతులకుగూడ రుచించలేదు. కావునే తన యీ విప్లవధోరణి ప్రజానీకమునకుగూడ నచ్చదని నాడు వూహించివుండవలె. కావునే ధనికవర్గములపై జరుపు దాడివుధృతమును, కాలోచితముగ, తగ్గించాడు; అంతేగాని విప్లవతత్వమును వీడినాడని తలంచరాదు.

చాంపరాన్ సత్యాగ్రహం ద్వారా రైతులను ప్రత్యక్ష పోరాటోత్తేజితులజేసి, నవ్యరైతు వుద్యమమునకు నాందీ ప్రస్తావనజేశాడు రైతాంగ విప్లవయుగమునకే చాంపరాన్‌లో ప్రాతిపదికలు వేశాడు. కెయిరా, బార్డోలి శిస్తు నివారణోద్యమాలు, క్షామపీడిత ప్రజాసహాయోద్యమాలను ఆర్గనైజ్ చేసిన సందర్భంలో ముందుగ, అతి జాగరూకతతో గ్రామీణ ఆర్థిక విచారణలు జరిపి, వాటి ఆధారమున రైతు కోర్కెల, హక్కుల ప్రణాళికను ప్రకటించాడు.

అహమ్మదాబాద్ మిల్లుకూలీలసమ్మెకు నాయకుడై సత్యాగ్రహప్రయోగంద్వారా సమ్మెను భగ్నంచేయుటకు నియోగింపబడిన తుంటరులను వంగదీసి, యాజమానులనుగూడ లొంగదీశాడు. అహమ్మదాబాద్ కార్మికులకు గాంధిజీ కల్గించిన సౌకర్యములు ఒక్క లంకషైర్ కార్మికులకు తప్ప మరెక్కడాలేవు కూలి రేటు నిర్ణయంలో సంభవించు కార్మిక వివాదము విషయంలో, ఐచ్ఛికముగ, 'రాజీబోర్డు' తీర్పును యజమానులచే అంగీకరింపజేయు హక్కును సాధించుట సామాన్యవిషయము గాదు. కార్మికోద్యమానికి నాయకుడేగాక మార్గదర్శకుడే గాంధిజీ.

రౌలత్ శాసనోల్లంఘనంద్వారా, సామ్రాజ్యవ్యతిరేక పోరాటం సాగించవలసిన జాతీయ పోరాట శక్తులకు నూతనోత్సాహాన్ని, చైతన్యాన్ని గల్గించాడు. ఇట్లనేక పోరాటములద్వారా, ప్రజలకు సన్నిహితుడై, 1921 సహాయ నిరాకరణోద్యమం నాటినుండి భారత ప్రజానాయకుడు కాగల్గాడు గాంధిజీ. సహాయ నిరాకరణోద్యమం రైతులను మేల్కొల్పింది. జాతీయ దృక్కోణంతో, సాంఘికార్థిక సమస్యలను తిలకించు సాంప్రదాయము నీ

ఉద్యమం శాలకొల్పింది. అస్పృశ్యతానివారణ, మద్యనిషేధం, ఖద్దరు, హిందూ-మహమ్మదీయ సఖ్యత, గృహపరిశ్రమలు మున్నగు సాంఘిక, ఆర్థిక సమస్యలకు గాంధిజీ నాయకత్వ స్వీకరణముతో, రాజకీయములతో సన్నిహితత ఏర్పడింది.

1930 లో వైస్రాయి ఇర్విన్‌కు అందజేయబడిన 11 అంశముల ప్రణాళిక, ఉప్పుసత్యాగ్రహోద్యమము రూపేణా జాతీయవాదులను ప్రజల ఆర్థికావసరములపట్ల శ్రద్ధవహించి పనిచేయాలని హెచ్చరించాయి. ఉప్పుసత్యాగ్రహం జాతీయోద్యమాన్ని విస్తృతపరిచింది. తమ్ము పీడించు వర్గముల, దురన్యాయముల నెదుర్కొంటూ, జాతీయోద్యమాన్ని బలపరచుకొను మార్గమును ఉప్పుసత్యాగ్రహం రైతులకు చూపింది. (పన్నుల నిరాకరణ, అటవీ సత్యాగ్రహం)

“శ్రమజీవులగు భారతప్రజల హక్కులకు భంగకరముగ ప్రవర్తించు దోపిడివర్గములు స్వదేశీ, విదేశీ విచక్షణలేకుండ సమసిపోవాలి” అని రౌండ్ టేబుల్ సభా వేదికలో ప్రకటించి, శ్రామికవర్గముల పక్షపాతమును గాంధిజీ మరొక్కసారి వెలిబుచ్చాడు.

1931—32 విరామకాలమందు జరిగిన కరాచీ కాంగ్రెస్ ప్రాథమిక హక్కుల తీర్మానం చేసింది. రైతు, కూలీ ప్రజల వర్గహక్కులను పేర్కొని స్వతంత్రభారత్ ఆ కోర్కెల నీడేర్చునని స్పష్టీకరించుటద్వారా, కండ్లకు కట్టినట్లు స్వతంత్రభారత సౌధమును చిత్రించింది. స్వాతంత్ర్యం సాధించక పూర్వమే, కరాచీ తీర్మాన సాఫల్యతకు కాంగ్రెసు కృషి ప్రారంభించింది. ఫైజుపూర్ కాంగ్రెసు వ్యవసాయక ప్రణాళిక, ఎన్నికల ప్రణాళిక లున్న కరాచీ ప్రాథమికహక్కుల ప్రకటనను విశదపరచాయి.

గత కాంగ్రెసు మంత్రివర్గముల హయాంలో “జమీందారీ విధానమును ఏవిధమైన పరిహారము లేక, తక్షణం రద్దుచేయాల”ని రైతుఉద్యమం చేసిన ఆందోళనకు గాంధిజీగారు విముఖత చూపించుటవల్ల రైతాంగములో నిరాశా భావం వ్యాపించింది. అట్లని “జమీందారీ విధాన నిర్మూలనమునకు గాంధిజీ సదా విముఖుడని, ఆయన అభివృద్ధి నిరోధకుడే”నని తీర్పు చెప్పకూడదు. “శాసనసభలద్వారా జమీందారీ విధానం రద్దుపరచుకొనే ప్రయత్నంతో మాత్రమే రైతులు ఆగిపోరాదు. శాసనసభలవల్ల జరగని పనిని, సత్యాగ్రహము ద్వారానైన సాధించుటకు రైతులు సంసిద్ధులైవుండాలి” అని 1934 వెంకటగిరి జమీన్ రైతు సభలోనే గాంధిజీ హెచ్చరిక చేసినను విషయమును విస్మరించరాదు.

గాంధిజీ సరియైన వాస్తవికవాది. సత్వర స్వరాజ్యసంపాదనకు 'జాతీయ ఐక్యసంఘటన'ను నిర్మించవలసిన బాధ్యత ఆయనపై వుంది. సామ్రాజ్య వ్యతిరేక జాతీయైక్య సంఘటనను భంగకల్గించు చర్యలను ఆయన ప్రోత్సహించడు; ఆమోదించడు. కావుననే జాతీయ విప్లవదశలోనే వున్నపుడు, జాతీయైక్యతను భంగము కల్గించనిరీతి ఆయా వర్గములు తమ కోర్కెలను పరిమిత పరచుకోవలెనని ఆయన ఆశయం.

ఇదిఇట్లుండ రైతులనుగూడ సంఘటింపనీడు, ఎట్టి పరిహారము లేక, జమీందారీ విధానమును రద్దుపరచుకోగల విప్లవశక్తి తమకు చేకూరలేదనీ, నాటి కాంగ్రెసు మంత్రివర్గాలుగూడా అంతటి విప్లవాత్మక చర్యలకు గడంగగల శక్తిలేదని గుర్తించారు "ముందు స్వరాజ్యం, ఆ వెనుక సోషలిజం" అను నెహ్రూజీ నినాదముయొక్క విలువను గుర్తించారు. స్వాతంత్ర్యోన్ముఖియైన కాంగ్రెసు సామ్యవాద విప్లవమునకు దారితీయగలదే గాని, జాతీయ విప్లవదశలో సోషలిస్టుసంస్థగ మారలేదనిగదా; కావుననే కాంగ్రెసు ప్రణాళికలలో సోషలిస్టు ఛాయలుమాత్రం కన్పిస్తాయి. రైతు, కూలీ, ప్రజా వర్గ సంఘముల నిర్మాణమును కాంగ్రెసు ప్రోత్సహించుటకు కారణం యిదే.

"దరిద్రనారాయణులకే స్వరాజ్యం" అని గాంధిజీ స్పష్టంగా ప్రకటించాడు. సహకారపద్ధతిని గృహపరిశ్రమలు చేతి పరిశ్రమలు నెలకొనాలనీ, ముఖ్యజీవితావసర వస్తూత్పత్తి గ్రామంతీరు స్వయంపోషకమై వుండాలనీ, భారీ యంత్రపరిశ్రమలు సంఘపరమై వుండాలనీ సూచించుటద్వారా, ధనికవాద మంతరించుటకు దారితీస్తునే, ప్రపంచ ధనిక. సామ్రాజ్యవాద దోపిడుల ప్రాబల్యమునుండి రక్షణమార్గం చూపుతున్నాడు గాంధిజీ.

పరుల శ్రమను దోచుకొను బస్తీ, ధనికవర్గముల ప్రాబల్యమును తగ్గించు గ్రామీణ ఆర్థికవిధానము ద్వారా సామాజిక వ్యవస్థను, సామ్యవాదానుకూల పద్ధతిన పునర్నిర్మించాలనియే గాంధిజీ ఆశయం. "అన్యాయపూరితమైన యీనాటి సాంఘిక వ్యవస్థను సంపూర్ణముగ మార్చి, దానిస్థానే న్యాయబద్ధమైన సాంఘిక వ్యవస్థను నెలకొల్పాలి"న్న 1940 రాంఘుర్ తీర్మానము, రైతు కూలీ, ప్రజారాజ్యాశయమును ప్రకటించిన ఆగస్టుతీర్మానముగూడ, కాంగ్రెసు త్వరితగతి సోషలిస్టుమార్గమున పురోగమించుచున్నదనుటకు నిదర్శనములే.

మారణహోమములనుండి ప్రజలను రక్షణగల్గించుటకు ప్రపంచ సమాఖ్య యేర్పడాలని కాంగ్రెసు అంటోంది. పతిత ప్రజావిప్లవములకు మార్గదర్శక

పైన కాంగ్రెసుకు అహింస ఒక అస్త్రం. దౌర్జన్యకాండ వుండరాదని కాంగ్రెసు అభిమతము. ఐతే ప్రపంచశాంతి, భద్రతలకు కొంతదౌర్జన్య ప్రయోగముకు అవసర మేర్పడవచ్చు, కావున నే ప్రత్యేక పరిస్థితులలో, ప్రజా శ్రేయము, సంరక్షణ కొరకు, తప్పని సరియైనపుడు దౌర్జన్య ప్రయోగమును కాంగ్రెసు ఆమోదించుతుంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో, మిత్రరాజ్యములతో, సమానహోదాన సహకరించు సంసిద్ధతను కాంగ్రెస్ ప్రకటించింది. గూడా! ఐతే ఇంతమాత్రమున నే కాంగ్రెసు అహింసను వీడిందనిగాని, హింసయే ఆచరణ యోగ్యమనిగాని యెంచరాదు. హింసాయుత వాతావరణంలో, ప్రజా శ్రేయముకై, జరుపు హింసాప్రయోగమును ఆమోదించినను, అహింసాయుత ప్రపంచ రాజ్యస్థాపనకు కృషి చేస్తుంది కాంగ్రెసు.

---

## 4

## సామ్యవాద జాతీయత

ముందు పేర్కొన్న పంచమహాశక్తులలో జాతీయత, సామ్యవాదముల కలయిక ఒక ప్రేలుడు గనిగ పరిణమించవచ్చు. వీటికలయికకు, యిక నియంతృత్వముగూడ తోడగుచో విషాదపరిస్థితి సంభవించి తీరును. ఈ మూడింటి కలయిక సహజముగ 'హింస'ను వరించును. జాతీయత, సామ్యవాదము నియంతృత్వము, హింసల కలయికయే (జర్మనీ) ద్వితీయ ప్రపంచ సంగ్రామారంభమునకు దారిదీసింది

యూదీయులపై జరిగిన హింసాకాండకు, సోషల్ డెమోక్రటిక్ పార్టీ ఆదిగాగల అనేక రాజకీయపార్టీల నిర్మూలమునకు, నాజీజము నాలింగనం జేసుకొనొల్లని మైనారిటీవర్గములను మటుమాయంజేయుటకు, కాంసెంట్రేషన్ క్యాంపుల వ్యాప్తిమున్నగు అనేక నాజీదుండగములకు పైనాల్గు శక్తుల కలయికే కారణము.

రష్యాలో సామ్యవాదము, నియంతృత్వము, హింస అను మూడు శక్తులకలయిక ఫలితమే స్టాలిన్ రైతాంగ వ్యతిరేక వైఖరికి, స్వతంత్రులగు

శక్తులను నిర్దయాత్మకముగ స్టాలిన్ హింసించుటకు కారణమైనది. కమ్యూనిస్టు రాజకీయాధిక్యత నంగీకరించని సోషల్ డెమోక్రటిక్ పార్టీ సర్వనాశనమునకు, కమ్యూనిస్టు పార్టీలోని ట్రాట్‌స్కీ అనుచర బృంద నిర్మూలనమునకు, యితర రాజకీయ మైనారిటీల నిలయమునకు, పైమూడు శక్తుల కలయిక ప్రభావమే కారణము

పరిశుద్ధమైన అంతర్జాతీయత జాతీయ స్వయం నిర్ణయము పట్ల ప్రాతికూల్యము నే కల్గియుండును. అంతర్జాతీయత, అవ్యక్తజాతీయత; సామ్యవాదము, నియంతృత్వము, హింసల కలయికగూడ కంటక ప్రాయమగును. ఫిన్లండు, యితర బాల్కన్, బాల్టిక్ రాజ్యాలపట్ల సోవియట్ రష్యా కాఠిన్య వైఖరి యిందులకు నిదర్శనము.

ఇక ఆర్థికరంగంలోగూడ యీ శక్తుల కలయిక నాజీ దోపిడీ విధానంవలె – భయానక దోపిడీవిధానముగ దాపరించును. స్వదేశంలో సామ్యవాదము ననుసరించుచున్నను, విదేశాలలో సామ్రాజ్యవాద నగ్నస్వరూపం ప్రత్యక్షమైతీరును. దీనికిని, స్వదేశంలో ప్రజాతంత్రం గల్గియున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదమునకును ఆట్టే భేదముండదు.

వర్గ నియంతృత్వము, హింసల కలయిక ప్రమాదకరమే గాక, అభివృద్ధి నిరోధకముగూడ. ఫ్రెంచివిప్లవంలో రైతాంగనియంతృత్వము, నేడు సోవియట్ రష్యాలో కార్మిక నియంతృత్వము. యీ రెండును యితర వర్గములకు యీతిబాధలు గల్గించుటద్వారా అభివృద్ధి నిరోధకములైనాయి.

దీనివల్ల పంచ మహాశక్తులలో నియంతృత్వము, హింసలు దుష్టశక్తులనియు, శ్రామిక వర్గముల హక్కు- భద్రతలకు భంగకరమని విదితమైనది. కావున శ్రామిక వర్గముల క్షేమభిలాషులు, ప్రజారాజ్య నిర్మాతలు దుష్టశక్తులను దరిజేరనీయరాదు అహింస, ప్రజాస్వామికములనే ఆరాధించవలెను. సోదర శ్రామిక వర్గముల భావములు, అవసరముల ప్రకటనను గౌరవిస్తూ అహింసా వాతావరణంలో ప్రజాస్వామిక హక్కుల పొందగలరు.

స్వచ్ఛందమైన అహింసాత్మక ప్రజాతంత్ర సమాజములోనే, ఒక వర్గమును మరొక వర్గము, ఒక బృందాన్ని వేరొక బృందం దోపిడి చేయుట వుండదు. "దోపిడీవిధానమే తుదముట్టించబడును" అని గాంధిజీ పల్కుట అతిశయోక్తి గాదు అసత్యము, మానవజాతి పీడనములకు హింసయే పునాది. హింసను వీడిన సమాజంలో ఇక దోపిడీ యేకాకిగ మనలేదు.

అన్ని శ్రామికవర్గముల ప్రజాతంత్రరాజ్యమైన, రైతుకూలీ ప్రజా రాజ్యంలో సర్వత్రా అహింసయే పాటించబడకపోవచ్చు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ప్రభుత్వం కొంత హింసాప్రయోగం జరుపవలసిరావచ్చు. జాతీయవిద్రోహమును, దోపిడిని, ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలను అంతమొందించుటలో ప్రభుత్వం పరిమితమైన హింసకు గడంగవచ్చు అట్లే జాతీయ విప్లవ దశలో అత్యవసర ఘట్టములలో, ప్రజాభీష్టమును స్థిరపరచుకొను సమయము లందు ప్రత్యర్థులపై అవసరంకొద్ది పరిమితమయ్యే హింసను ప్రయోగించ వచ్చును.

జాతీయతపై ఆధారపడు సోషలిజముగా గూడ, అహింసాత్మక ప్రజా స్వామికము ననుసరించు సోషలిజమే, శ్రామికవర్గములకు అభివృద్ధి నొసగగూర్చ గలదు ఏ ఒక్క వర్గము యొక్క, లేక వర్గములయొక్క నియంతృత్వము గూడ ప్రజాభ్యుదయమును, సామ్యవాదమును చేకూర్చజాలవు.

ఇక ప్రజాస్వామికము, జాతీయతలపై ఆధారపడకుండ, సామ్యవాద మున కుపకరించని జాతీయత యెంతోయునపైన ప్రమాదకరముగ పరిణమించ వచ్చును వ్యక్తుల నియంతృత్వమునకు గాని, దోపిడివర్గనియంతృత్వమునకు గాని దారితీయవచ్చు. దోపిడీదారుల హింసాప్రయోగమునకు సాధనముగ మార వచ్చును.

గాంధిజీ, నెహ్రూల కలయికవల్లను, అనేక బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక పోరాటములవల్లను మన జాతీయ కాంగ్రెసు మెరుగులుదిద్దింది. ప్రజా స్వామికము, అంతర్జాతీయత, అహింస సామ్యవాదము, జాతీయతల కల యిక కాంగ్రెసులో మూర్తీభవించింది.

జాతీయత, సామ్యవాదము, అహింస, ప్రజాతంత్రముల కలయిక నిర్దిష్టమైన అభివృద్ధిమార్గము ననుసరించి, ఒకే ప్రపంచ సమాఖ్య, ఒకే ప్రపంచ సైన్యము వుండే అంతర్జాతీయతకు దారితీయును యీ అభ్యుదయ శక్తుల సంయోగం భారత జాతీయ కాంగ్రెస్‌లో మూర్తీభవించింది.

సోషలిజము ననుభవిస్తున్న సోవియట్ రష్యాలో సైతం యీ అభ్యుదయశక్తుల సంయోగం లేదు. కావుననే రష్యాకు పరజాతులపై దురుసుదనము, కార్మికేతర వర్గములపై కఠినము, సామ్రాజ్యతృష్ణ మెండు.

## ౫

# భారత జాతీయత

పతిత ప్రజల జాతీయత అంతర్జాతీయతకు ప్రతికూలముగాని, ప్రతిబంధకము గాని గాదు. కాగా దినదినము వారిని అంతర్జాతీయోద్దీపితుల జేయు అఖండశక్తియే పతిత ప్రజల జాతీయత.

స్వతంత్ర దేశముల జాతీయత అంతర్జాతీయతకు ఒక మెట్టు. కావున జాతీయత, అంతర్జాతీయతలు పరస్పర విరుద్ధ శక్తులు గావు. రెండును ఒకదాని కొకటి దోహదకరముగా నుండు అభ్యుదయ శక్తులే

జాతీయతను శంకించువారు సోవియట్ రష్యా కేసి చూడగలరు. అంతర్జాతీయతను వీడి, సోషలిస్టు రష్యా జాతీయ పునర్జన్మ మెత్తుచున్నదంటే—జాతీయత యొక్క విప్లవస్వభావము నొక్క తప్పుగా మైన శంకించదగదని రష్యా హెచ్చరించిన ట్లగదా? సంగ్రామచైతన్యం పొందిన తన ప్రజానీకంలో పితృదేశ భక్తిని ప్రబోధిస్తూ, జాతీయగీతాలాపనము, జాతీయ పతాక ప్రతిష్ఠాపన, జాతీయ వీరపూజలపట్ల భక్తి విశ్వాసములు గల్గిస్తూ, జాతీయ యాత్రకు ప్రతిబంధకరమైన అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీని రద్దుపరచిందంటే, జాతీయత యొక్క విప్లవశక్తిని సోవియట్ రష్యా గుర్తించిన దన్నమాటే. సామ్యవాద ప్రపంచంలోగూడ జాతీయత అభ్యుదయకరమైన, ఉపయుక్తమైన విప్లవశక్తియేనని, ద్వితీయ ప్రపంచ సంగ్రామ మీ విధముగ ప్రకటించింది

అంతర్జాతీయతనుండి జాతీయమార్గమున సోవియట్ రష్యా నడుస్తున్న యీ సమయమందే భారత జాతీయత అంతర్జాతీయ బాధ్యతలను గుర్తించింది. అబిసీనియా, చైనా, స్పెయిన్ లకు సానుభూతి, సహాయముల నంపుటద్వారా ఫాసిస్టు, సామ్రాజ్యవ్యతిరేక అంతర్జాతీయతను ప్రకటించింది కాంగ్రెసు. కావున భారత జాతీయత అభివృద్ధి నిరోధకమునిగాని, మన జాతీయసంస్థలో ఫాసిస్టు దిక్కులున్నాయని గాని అనుట సత్యము గాదు.

భారత జాతీయవాదులు, సోషలిస్టులు కమ్యూనిస్టు సిద్ధాంతమును, కార్మికవర్గ నియంతృత్వమును ఉపసంహరించుకుంటున్నారు గనుకనే, వారిని కార్మిక వ్యతిరేకులుగా అపార్థం చేసుకోరాదు. ఏ ఒక్క గ్రామికవర్గము గూడ నియంతృత్వము చలాయించరాదనియే వారి అభిమతం. కమ్యూనిస్టు

మానిఫెస్టోలో చెప్పబడిన "అధిక సంఖ్యాకులగు శ్రామికుల" ప్రజ (రైతు, కూలి, ప్రజల) రాజ్యాన్ని సాధించ బూనుకున్నారు.

భారత జాతీయత పెట్టుబడిదారీ విధానపు పెంపుడు బిడ్డయని తలపోయరాదు. అట్లు తలంచుట చరిత్ర నపార్థము చేసుకొనుటే యగును. భారత దేశంలో మున్నెన్నడు మధ్యతరగతి ఉద్యోగం జాతీయ బాధ్యతలను గుర్తించి 1885 లో భారత జాతీయ కాంగ్రెసును స్థాపించారు. భారతీయ పెట్టుబడిదారీ వర్గములు 1903 వరకు జాతీయ సంస్థ ఆవశ్యకతను గాని జాతీయోద్యమ ప్రాముఖ్యమును గాని గుర్తించనే లేదు. నిజము చెప్పవలెనంటే పెట్టుబడిదారీ వర్గములకు తోడ్పడునదని యెంచబడిన స్వదేశీ ఉద్యమమే జాతీయోద్యమముయొక్క పెంపుడుబిడ్డ గాని, జాతీయోద్యమము పెట్టుబడి వర్గముల సృష్టి గాదు. నేటికిని కొద్దిమంది భారతీయ ధనికులే జాతీయోద్యమమును బలపరుస్తున్నారు; బహు కొద్దిమంది మాత్రమే జాతీయోద్యమములో పాల్గొంటున్నారు. ధనిక, పెట్టుబడి వర్గముతో జాతీయోద్యమమునకు సహాయ నిరాకరణము జరుపవలసిన అగత్యంలేదు. వారు శత్రు మకాంలో చేరకుండ జూచుకోవలసిన అవసరమే వున్నది. శ్రామికులతో కలియకున్నను, ధనికవర్గాలను శత్రువులతో చేరకుండా, తటస్థముగనైనా వుంచే చతురతను జాతీయ నాయకత్వము ప్రదర్శించవలసి యుండును. మితిమీరిన ఒత్తిడి గలుగుచో ప్రత్యర్థి మకాములో చేరు ప్రమాదంవుంది.

ఇప్పటికే మన జాతీయోద్యమమునకు అననుకూలురనేకులున్నారు. అవకాశవాదులు, భీరువులు, దేశభక్తిరహితులు ఆ శ్రేణికి చెందినవారే. వీరుగాక, పురాతనమైన, శిథిలమైన సాంఘిక అన్యాయములను, బ్రిటిష్ ప్రభుత్వ కృపాకటాక్షములతో, సంస్కరింపవచ్చునని తలపోయు సంస్కరణవాదులు, సనాతన ఛాందసులుగూడ జాతీయ ప్రతికూలశ్రేణికి చెందినవారే. ఈ శక్తులు చాలవో అన్నట్లు కమ్యూనిస్టు, రాయిస్టు, ముస్లింలీగ్, అంబేద్కర్ పార్టీలుగూడ జాతీయోద్యమమునకు దూరమైనాయి. ఈ నూతన జాతీయ ప్రతికూలశక్తులు జాతీయోద్యమానికి వెన్నుపోట్లు పొడవనారంభించాయి. కాంగ్రెసు కన్నమించిన దేశభక్తిని నటించిన కమ్యూనిస్టు, రాయిస్టు పార్టీలు, పరీక్షాసమయంలో శత్రుమకాం జొచ్చి, జాతీయ సంగ్రామోద్యమమును భంగపరిచారు. జాతీయవీరులను పంచమాంగదళమనీ, విధ్వంసకారులనీ నిందిస్తూ, శత్రువులకప్పగించ సాహసించారు. (ముస్లింలీగ్, అంబేద్కర్ పార్టీల విషయం వేరొకచోట)

ఇట్టి పరిస్థితులలో కాంగ్రెసు బలమును కేంద్రీకరించుకొనుటే మన విధి. సామ్రాజ్యవ్యతిరేక విప్లవైక్య సంఘటనను సమకూర్చుకొనుట మన కర్తవ్యం.

భారత జాతీయత అభివృద్ధి నిరోధక శక్తి గాదు.

మన సామ్రాజ్య వ్యతిరేకత, ధనికవాద ప్రతికూల కార్యక్రమములు మాత్రే ప్రపంచవ్యవస్థా నిర్మాణమునకు బలమునిచ్చునవి. దేశరాజకీయైక్యత నిల్పుటకై కాంగ్రెసు అనుసరించిన విధానము ఉదాత్తమైనది. భిన్నసంస్కృతి మతములుగల్గి, నైసర్గికముగ ఒకే ప్రదేశంలో జీవించు వేర్వేరు రాష్ట్రములకు జాతీయ రాజ్యాంగములో స్వేచ్ఛాయుత స్వపరిపాలన ముండాలనుట ఉదాత్తమైన విషయము.

వర్గసంఘముల నిర్మాణమును గుర్తిస్తూ, రైతు, కూలీ ప్రజారాజ్య ఆశయమును ప్రకటించి, సోషలిష్టు సందేశమును సమన్వయపరస్తూ, సామ్యవాద అంతర్జాతీయ పథమున పురోగమించుచున్న భారతజాతీయ కాంగ్రెసు వివిధ జాతీయోద్యమములకు తలమానికము; మార్గదర్శకము.

రష్యా, జర్మనీల జాతీయత, సామ్యవాదముల కలయిక భిన్నవిధములైనది. జర్మనీలో జాతీయతకు ప్రధానభూమిక, రష్యాలో సామ్యవాదమునకు ప్రాధాన్యము. రెండు దేశములలోను హింస, నియంతృత్వము వున్నాయి. జర్మనీది జాతీయ సామ్యవాదమైతే, రష్యాది సామ్యవాద జాతీయత.

భారతదేశములో అహింసా, ప్రజాస్వామికములపై ఆధారపడిన సామ్యవాదజాతీయత మనసామ్యవాద జాతీయత అన్ని విధములైన సామ్రాజ్యవాదములకు, దోపిడీ విధానములకు ప్రబల శత్రువు.

# 6

## జాతీయత : మతము

ప్రజలందరినీ కదిలించగల ఆదిశక్తి జాతీయత కుటుంబము, వంశము, భాష, సంస్కృతి, స్వభావములలో జాతీయతా చిహ్నములు గోచరమౌతాయి. ప్రతి చిన్న విషయమందును జాతీయతా బీజము లుంటాయి.

జాతీయత ముఖ్యముగ పతిత ప్రజల జాతీయత ధనికవాదముతో సంబంధం లేని స్వతంత్రశక్తి ఐనను ఆర్థికావసరములు, కోర్కెలపట్ల ప్రజలు తమ వైఖరిని నిర్ణయించుకొను విషయంలో జాతీయతాచ్ఛాయలు కనిపిస్తాయి.

"జాతీయత ధనికవాదము యొక్క సృష్టి" అని మార్క్స పొరబడినందున కార్మిక వర్గము "సంకుచితమైన జాతీయత" నధిగమించి, అంతర్జాతీయత నవలంబించాలని, ఉపదేశించాడు. లెనిన్ కూడ 1917 వరకు యీ ఉపదేశ ప్రభావమునకే లోనై వున్నాడు. కావున నిజాతీయ ప్రభుత్వం నిర్వహించుచున్న యుద్ధప్రయత్నాలకు కూడ కార్మికులు తోడ్పడరాదంటూ విప్లవ జ్వాలలను రగుల్కొల్పాడు. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ చేత కూడ జాతీయయుద్ధప్రయత్నాలకు తోడ్పడరాదను తీర్మానం చేయించాడు. కాని తీర్మానం అంగీకరించినవారే, స్వదేశాలకు తిరిగి వెళ్లి, ప్రజల సంగ్రామోత్సాహాతిశయమునకు చకితులై, సమధికోత్సాహంతో తాముగూడా జాతీయయుద్ధ ప్రయత్నములకుతోడ్పడ నారంభించారంటే, జాతీయతా ప్రభావ మెంతటిదో తెలియనగును.

రష్యన్ జారుల దాస్యమునకు లోనైన జార్జియన్ వంశీయుడు కాబట్టి జాతీయతాశక్తిని గుర్తెరిగి, "జాతీయత్వము"ను గురించి "స్మృతి" (Thesis) వ్రాశాడు. విప్లవానుభవమునకు స్టాలిన్ స్వానుభవము కూడ తోడై, 'జాతీయత' పట్ల లెనిన్ వైఖరిని మార్చగల్గాయి 1917 లో.

సంగ్రామ విజయమును సాధించుటకు యుక్తమైన శక్తిగ అధికార వర్గములచే గుర్తింపబడిన జాతీయతే, విప్లవవ్యాఘాతము నంతమొందించు విలయాస్త్రముగ లెనిన్ చే గుర్తింపబడింది.

నిర్మాణాత్మకశక్తిగనే గాక, నిరోధకశక్తిగకూడ జాతీయత రూపొందవచ్చు. ధనికవర్గములు, శ్రామికవర్గములుగూడ స్వార్థప్రయోజనములకై జాతీయతను దుర్వినియోగ పరచుకొనగల అవకాశములు లేకపోలేదు. తమ జాతీయ భక్తిని ధనికవర్గములు దుర్వినియోగ పరచుకుంటున్నారని యెరింగియు, ప్రజలు జాతీయతా ప్రభావమునకులోనై వున్నారంటే జాతీయత విలువను తృణీకరించరాదన్నమాటే. ఐతే జాతీయత ప్రజాభ్యుదయకరముగ పరిణమించవలెనంటే సామ్యవాదముతో మిళితంగామారి, సామ్యవాదము, జాతీయతల సమైక్యత ఫలితం శ్రామికప్రజల హృదయాలను హత్తుకొనిపోగలదు

మతము: నరబలి, యజ్ఞముల దశనుండి జంతుబలికి, క్రమంగా ప్రతిమా పూజకు సమాజం పరిణామమంది, క్రమంగా వాంఛావిసర్జన, ఆస్తి విసర్జన, తుదకు సర్వసంగపరిత్యాగముకు మానవసమాజం మార్పు చెందుతూంది. (హిందూసమాజ పరిణామం గమనార్హం)

జాతీయతవలె, ప్రజలపై ప్రభావంగల ప్రధానమైన అనాదిసిద్ధమైన శక్తియే మతము. ప్రజలపై మతముయొక్క ప్రభావమును అలక్ష్యం చేయరాదు. పాకిస్థాన్ అంటే పుణ్యస్థానము అని అర్థం. అందు మతము యిమిడి వున్నదన్నమాటే. ముస్లింలీగు ధనికవర్గముల ఆధిక్యతకు అణగియున్నప్పటికిన్నీ, ముస్లింప్రజలు లీగ్‌ను అనుసరించుకుటకు గల కారణమేమంటారు? ప్రజల హృదయాలలో దాగియున్న ఆధ్యాత్మికధ్యానమును, పాకిస్థాన్ అను తీపు నినాదమును ప్రకోపింపజేయుట వల్ల కాదా? ముస్లింలీగు వృద్ధి, బలము 'మతము' అనుయాయులపై ఆధారపడి యున్నది. రాజకీయములపై, ప్రజల మతముయొక్క ప్రభావంగూడ ప్రస్ఫుటమౌతుందన్నమాటే. ఇది 'భౌతిక వాదులు' మనుకొనేవారు తప్పక గమనించాలి.

రాజకీయములలోనికి గాంధీజీ మతమును జొప్పించాడనుటకన్నా, గాంధీజీ మతతత్వ పూరితులలోనికి రాజకీయములు చొప్పించాడనుటే సమంజసము; సత్యము. ఆధ్యాత్మికచింతనముకు, మతతత్వమునకు భారతదేశం పేరెన్నికగన్న దేశం. రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, రామతీర్థ, దయానంద ప్రభృతులు ప్రజలలో "ఆధ్యాత్మిక చైతన్యం" కల్గిస్తూ, 'జాతీయత'కు దోహదమిచ్చారు. దీనిపైననే నౌరోజీ, తిలక్, గాంధీజీలు రాజకీయ, బీజమును నాటారు. వీరివలెనే మత ప్రాధాన్యంగల లీగును రాజకీయములవైపుకు మళ్లించుటకు అలీసోదరులెంతో కృషి చేశారు.

మతమును రాజకీయములకై వినియోగించుట రెండువిధములుగ పరిణమించింది ఈ దేశంలో, సామ్రాజ్యవ్యతిరేక రాజకీయ పోరాటమునకుమతమును గాంధీజీ వినియోగించుట అభివృద్ధిదాయకము. మతములు "జాతీయతో" పై వుసిగొల్పుచున్న జిన్నా వైఖరి అభివృద్ధి నిరోధకము. లెనిన్ గూడ మతము యొక్క ప్రభావమును గుర్తించ బట్టియే "మతమనస్కులను మిషతో కమ్యూనిస్టు పార్టీనుండి తొలగించరాద"ని ఆదేశించాడు. "మతము ప్రజల పాలిటి మత్తుమందేయైనా, మతముపై ధ్వజమెత్తుట ప్రధమావసరం గాదు." అని "సోషలిజము, మతము" అను గ్రంధంలో లెనిన్ వెలిబుచ్చాడు.

కావున మతమనస్కులైన ప్రాచ్యదేశములందు, పీడితదేశములందు మతముయొక్క శక్తిని, ప్రభావమును అలక్ష్యం చేయరాదు. ఆఫ్రికాలో, నీగ్రోలలో మతము మరింత ప్రాధాన్యత వహించుశక్తి సామ్యవాద జాతీయత వాశించు పతిత ప్రజానాయకులు "మతము యొక్క రాజకీయ పటిమ" విషయమై ప్రత్యేక పరిశోధనజేసి, జాతీయ విప్లవోద్యమాలకు మతము యొక్క ప్రభావమును గూడ జతచేయదగును.

---

# 7

## జాతీయత : సాంఘిక విప్లవం

జాతీయతలో, ముఖ్యముగ పతిత ప్రజల జాతీయతలో సాంఘిక విప్లవ బీజములుగూడవున్నాయి. కావున జాతీయతను సోషలిస్టులు సాంఘిక విప్లవసాధనకుగూడ వుపయోగించుకొనవచ్చును. జాతీయతయొక్క సాంఘిక విప్లవస్వభావమును సోషలిస్టులు పూర్తిగ గుర్తెరిగిననాడే, అభ్యుదయ శక్తిగ ప్రయోగింప బడగలదు.

సామ్రాజ్యవ్యాప్తికి, మిలిటరీతత్వమునకు హిట్లర్, మసులోనీలు జాతీయత నుపయోగించుకొన్నారు. కాని మెక్సికో అధ్యక్షుడు కార్డినాల్, మహాత్మాగాంధిగారలు జాతీయతను అభ్యుదయ శక్తిని గురించి, అభివృద్ధి మార్గమున ప్రయోగించుతున్నారు.

# జాతీయత : సాంఘిక విప్లవం

మెక్సికో అధ్యక్షుడు సోషలిస్టుగాదూ; కమ్యూనిస్టుగాదు. జాతీయ సాంఘిక విప్లవవాది. బ్రిటిష్ అమెరికన్ పెట్టుబడిదారులకు, మెక్సికో నూనె గనులయందున్న హక్కులు, సౌకర్యములు (పేర్లు) స్వాధీనపరచుకొని, జమీందారీలను రద్దుపరచి సాముదాయక వ్యవసాయ క్షేత్రములను ప్రారంభించాడు. పరిశ్రమలపై కార్మికుల ఆధిపత్యమును నెలకొల్పాడు. ఈ మహాత్కార్య సాధనముకు ప్రజల 'జాతీయభక్తి' అయనకు తోడైంది.

19వ శతాబ్దంలో స్వాధీనపరచుకున్న బ్రిటిష్ భూస్వామ్యములకు యిస్తున్న పరిహారమును రద్దుపరచగల్గుటలో డీవలరాను ఐర్లెండు ప్రజల జాతీయత అండగా నిలచింది. స్వాధీనపరచుకున్న జమీందారీలలో సమిష్టి వ్యవసాయమును ప్రవేశపెట్టాడు.

టర్కీ అధ్యక్షుడు కెమాల్ పాషా ఘోషాపద్ధతిని రద్దుపరచుటలోను ప్రజావిద్యావిధానమును ప్రవేశపెట్టుటలోను, ప్రభుత్వ పరిశ్రమల సంస్థాపనములోను, తను కంగీకృతమయ్యే వుపయోగకరమైన షరతులపై విదేశీ పెట్టుబడి నాహ్వానించుటలోను, ప్రభుత్వ పరపతి సంఘములు ఏర్పరచుటలోను, విజయమందుటకు గల కారణం, ప్రజల జాతీయత ఆయనకు అండగవుంటమే.

చైనాలో భూస్వాముల, షాహుకారుల ప్రాబల్యమును తగ్గించి, సహకార పరపతిసంఘాలు, సహకార విక్రయశాలలు, జంగ్-కై-షేక్ యేర్పరచాడు. చైనా నవజీవనోద్యమము, సహకార పరిశ్రమలు జాతీయత పునాదులపైనే నిర్మింపబడ్డాయి.

భూస్వాములు, ధనిక వాదులు, తమ ఆస్తులపై యజమానులు కారు సంఘశ్రేయముకొరకు నియమితులైన ధర్మకర్తలుమాత్రమే అంటూ, పెట్టుబడికి "శ్రామికులే" యజమానులు అని గాంధిజీ హెచ్చరించాడు. శ్రామిక ప్రజలు సుసంఘటితులై ధర్మకర్తలనుండి ఆస్తుల వాపస్ కోరుచో, వారు శ్రామిక ప్రజాభీష్టమునకు చెవియొగ్గవలసియుండునని గూడ ప్రకటించాడు గాంధీజీ జమీందారుల, యజమానుల ధర్మకర్తృత్వం ప్రభుత్వ అజమాయిషీలో బడివుండాలనటద్వారా, ధర్మకర్తలపై అధికారం ప్రభుత్వ బాధ్యత వహించు శాసనసభ చేతుల్లో వుంచాడు. శాసనసభలో నిజమైన శ్రామికులే వుండాలని గాంధిజీ ఆశయం. ఇట్లు వర్గపోరాటముతో నిమిత్తం లేకుండగనే, వర్గరహిత సమాజమును నిర్మించనెంచాడు గాంధిజీ

ఈ విధముగ సాంఘిక విప్లవ స్వభావంగల జాతీయత, సోషలిజమునకు శ్రీరామరక్ష కాగలదు జాతీయతా తేజస్సంగాని, సోషలిజం— ఒకపక్క అది

సాధించబడినా, స్థిరపరచుట దుస్సాధ్యము. సంపూర్ణ సామాజిక విప్లవం సాధించుటకు సోపానముగ వుండు జాతీయతను అలక్ష్యం చేయరాదు. ముఖ్యముగ ఆసియా, ఆఫ్రికాలాంటి పతిత ప్రజల జాతీయత తప్పనిసరిగ సోషలిస్టు విప్లవమునకు బాసటగ నిలుస్తుంది. జాతీయతా జనాది రహితమై, సోదర శ్రామిక ప్రజావర్గములతో కలియక, ఏకాకిగా ఆగ్నేయ యూరప్ దేశాలలో సాగిన కార్మిక విప్లవములు విఫలమగుటవల్ల జాతీయోత్తేజితంగాని సోషలిజం స్థిరపడజాలదని తేల్చి చెప్పగల్గితిమి.

సామ్రాజ్యవాదమునకు మూలస్తంభమైన అంతర్జాతీయ ధనికవాదమునకు ప్రబలవిరోధియైన పతిత ప్రజల జాతీయత, తన ప్రతిఘటనా వుద్యమంలో పరిశ్రమలన్నియూ జాతీయంగావాలని, సమాజికదృష్టితో ఆర్థిక స్వాయంపోషకత్వ సూత్రముపై ఆర్థిక వ్యవహారములు నిర్వహింపబడవలెనంటూ సామ్యవాదపథము ననుసరించుతూంది

ఇంతటి సాంఘిక విప్లవ స్వభావంగల జాతీయతను సోషలిస్టులమనుకొను వారు అలక్ష్యం చేయరాదు సరికదా, సోషలిస్టు వుద్యమమునకు చేదోడు చేసుకోవలెను.

---

# 8

## సాంఘిక విప్లవము

"రాజకీయముగ రేర్పడిన సమాజంలోని వుత్పత్తి సాధకుల మధ్య వుండు సంఘర్షణే విప్లవాలకు మూలము", అని 'చారిత్రక భౌతికవాదం'లో బుఖారిన్ పేర్కొన్నాడు.

కాని ప్రాచ్యప్రపంచ చరిత్ర సాంఘిక విప్లవములకు ఆర్థిక సంబంధమైన కారణం, అనేక కారణములలో ఒకటి యని నిరూపించుతుంది

ఇండియాలో బ్రాహ్మణులకు, చైనాలో మండారిన్లకు సమాజంలో అగ్రస్థానముండెడిది. వారిలో నిరుపేదలు, కుబేరులుగూడ వున్నారు. కాని

సమాజంలో వారికి లభించిన ఉన్నత స్థానము ఆర్థికమైన కారణంవల్ల లభించలేదు గదా?

ఇండియాలో "గౌరవప్రతిపత్తి" కొరకై క్షత్రియులు విప్లవాత్మకమైన తిరుగుబాట్లు చేశారు. పరశురామ - కార్తవీర్య యుద్ధానికి విప్లవతత్వమే కారణం.

బౌద్ధయుగం నాటికి - బ్రాహ్మణులు, క్షత్రియులు ఏకమై, సమాజంలో సమిష్టిగా గౌరవింపబడుతూవచ్చారు. భారతసంఘమును వృత్తులననుసరించి కులములుగ విభజించారు. ఈ విభజనలో మహత్తరభావం గర్భితమై యున్నది. సమాజ క్షేమం పేర, "నావిష్ణు పృథ్వీపతిః" అంటూ, క్షత్రియుల ప్రాబాల్యమును, బ్రాహ్మణుల గౌరవస్థానమును అంగీకరింపచేశారు.

ఇట్లే ఆఫ్రికన్ భూతవైద్యులుగూడ ఆర్థికేతర కారణముల వల్లనే ఔన్నత్యం పొందారు. మహమ్మదీయ దండయాత్రలు, విజయములు, ఆరు శతాబ్దాల మహమ్మదీయ పరిపాలనాప్రభావంగూడ హిందూసంఘములో బ్రాహ్మణులకు వున్న గౌరవమును తగ్గించలేకపోయినాయి. వేదములు భగవత్ సృష్టియని సాంఘిక విభజన దైవనియుక్తమని అంటూ, సాంఘికవ్యవస్థ, వ్యవహారములపైనను, విద్యావిధానముమీదను అగ్రకులీనులు నియంతృత్వాధికారము పొందుట, ప్రజల మూఢనమ్మకాలు, ఇవన్నియుగూడ అగ్రకులీనుల గౌరవప్రతిపత్తిని చిరస్థాయి చేయుటకు తోడైనాయి.

ఐనప్పటికిని, అప్పుడప్పుడు ఆదినుండే బ్రాహ్మణాధిక్యతగల భారత సామాజిక వ్యవస్థపై అనేక తిరుగుబాట్లు జరిగినాయి. బుద్ధుడు, రామానుజాలు, కబీర్, గురు నానక్, రాజా రామమోహనరాయ్, బ్రహ్మ సమాజికుల ఉద్యమములలో యీ తిరుగుబాటు బీజములిమిడి వున్నాయి.

గత అర్థశతాబ్దంనుండి, యు. పి. పంజాబ్, రాజపుత్ర స్థానములలో జాట్‌లు, మధ్యపరగణాల గోండులు, ఆంధ్రా రెడ్డి, కమ్మ, తెలగ కులములు, మహారాష్ట్రంలో మరాటీలు, తమిళనాడ్ నాడార్‌లు, కల్లార్‌లు, మారవులు, పల్లాలు, మలబార్ తియ్యాలు, తూర్పుకోస్తా బెస్తవాండ్రు ఇట్లే అనేక బ్రాహ్మణేతర కులములు, బ్రాహ్మణాధిక్యతపై దాడి సారంభించారు. ఈ తిరుగుబాటుదారుల సాంఘిక దురవస్థకు ఆర్థికన్యూనత కారణం కానేకాదు. రాజకీయాధికారం లభించినను, అదిగూడ వారి "సాంఘిక దుస్థితిని తొలగించలేకపోయింది. బ్రాహ్మణేతర కులస్థులలో ధనికులు సైతము "ఆత్మస్వాతంత్ర్యము" లేకుండా వున్నారు.

వేదములపై తిరుగుబాట్లు, భక్తి, స్మృతుల పునఃరచన, మున్నగు ప్రయత్నములన్నియు విఫలమైనాయి. గత శతాబ్దాలలో, ఛత్రపతి శివాజీ అంతటివాడు బ్రాహ్మణులచే (కులగురువు) క్షత్రియుడను ముద్రపొందవలసి వచ్చింది ఇట్లే తమ అధిక్యతను బ్రాహ్మణులచే గుర్తింప జేయుటకు అనేక ప్రయత్నములు జరిగినాయి. నాటుకోటి చెట్టియారుల వలెనే, మరి కొన్ని కులములే గుర్తింపును పొందాయి. బ్రాహ్మణులు తమ అధిక్యత నందగ జూచుకొని, స్వలాభములు ఆర్జించ గడంగారు క్రమంగా. ఒక కులము తిరుగు బాటుకు తోడ్పడటం అన్ని కులాలకు దారి చూపుటయే యగును. కావున మతగురువులు సహజంగా యెట్టిసాంఘిక మార్పులను అమోదించరు.

సమాజంలో బ్రాహ్మణ ఆధిక్యతకు ఆర్థిక ప్రతిపత్తికి సంబంధంలేదని భారత సమాజ పరిణామం నిరూపించింది.

బ్రిటిష్ పరిపాలన, మహమ్మదీయ, క్రైస్తవమతముల సంపర్కముల ప్రభావం హిందూసమాజంమీద బాగుగనే కన్పించింది.

పెరియార్ ఆత్మగౌరవోద్యమము, బీహార్ భూమియార్ల ఉద్యమము, ఆంధ్ర బ్రాహ్మణేతరోద్యమములు సాంఘిక విప్లవసిద్ధాంతములను ప్రసాదించ ప్రయత్నించాయి. దేవునిపై బసవన్న తిరుగుబాటుకు పట్టినగతియే, దేవునిపై ధ్వజమెత్తిన ప్రయత్నానికిన్నీ పట్టింది.

తాత్కాలికముగ యీయుద్యమములు విఫలమైనట్లు కన్పించినను, 'తక్కువ కులములు' వారిలో ఆత్మగౌరవమును రేకెత్తించాయి. వేదములను పేరులనుఅడ్డుపెట్టుకొని బయలుదేరిన స్వార్థపరుల ప్రాబల్యంతగ్గింది. బ్రాహ్మణేతరుల సాంఘిక స్థితి వృద్ధిగాంచ నారంభమైంది.

ఈ సాంఘిక విప్లవం సమగ్రంగా లేదు. అనేక కులములు ముందుకు వస్తున్నాయి. వేదములకు, చరిత్రకు నూత్న భాష్యములు, వ్యాఖ్యాలు తయారు చేస్తూ, బ్రాహ్మణికముకు సామీప్యముగ నుండునట్లుగ తమ తమకులముల పేర్లు మార్చుకుంటూ, గౌరవాధిక్యత గుర్తింప జేయుచున్నారు. వేల సంవత్సరముల సిరిసంపదలు సైతం సమకూర్చలేని గౌరవస్థానమును తమిళ నాడారులు, నాటుకోటి చెట్టియారులు, వైశ్యులు సాధించగల్గారు. ఆయా కులములకు చెందిన ధనికులు, ఆయా కులపెద్దలుగ వుంటం సంభవించింది. కులపెద్దల మాటను కులస్థులు జవదాటరు సహజంగా. కులములలో వున్నట్టి గౌరవస్థానమునే, సమాజమంతటిలోను పొందవలెనను తృష్ణ వారిలో బయలుదేరియుండ

వచ్చు. కులముపై వారికిగల పట్టుబడి సాధారణముగ చేసుకొని, సాంఘిక అగౌరవము నెదుర్కొన నారంభించినారు.

పాశ్చాత్య నాగరికతా సంపర్కము, ఫ్రెంచి విప్లవము, చారిత్రిక దృష్టితో సాంఘికోత్పాతముల పఠనము మున్నగున వన్నీ సాంఘిక విప్లవ ప్రవాహములకు వేయబడివున్న అడ్డు కట్టలను త్రెంచుటకు దర్పకమైనాయి.

బ్రాహ్మణాధిక్యత సన్నగిల్లుటకు గ్రామీణ నాగరికత (స్వయంపోషకం) క్షీణించుట కారణంగా చేరగా, భూమి, ధనములపై కాంక్ష పెరుగుట, సామ్రాజ్యాధికారంతో నేస్తం చేయుటవల్ల, ప్రజాసామాన్యం మేల్కాంచి, ఆర్థిక దోపిడికి బ్రాహ్మణ్యంకూడ తోడౌతున్నట్లుగ గుర్తించారు. కావుననే బ్రాహ్మణుల శక్తిని సన్నగిల చేయు తలంపుతో హిందూ దేవాదాయముల చట్టము, ఇనాముల అక్టు వచ్చినాయి. బ్రాహ్మణ ఖర్చుల బారినుండి తప్పించుకొనజూచిన ప్రయత్నము అభివృద్ధి శక్తిప్రభావమే యనదగును.

అస్పృశ్యతపై గాంధిజీ దాడి, 'హరిజనులు' అని వారికి గౌరవనామ మిడుట, హరిజన దేవాలయప్రవేశము, వారి విద్యావ్యాప్తికి కృషి చేయుట, జీవనభృతి నొసంగు వృత్తుల నేర్పరచబూనుట, నీచమని యెంచబడిన తోలు పరిశ్రమ, ధోబీపని మున్నగు హరిజనుల వృత్తులపైగల యేహ్యమును పోగొట్టుటేగాక, ఆ వృత్తులను కొనియాడుటతో గూడిన గాంధిజీ హరిజన కార్యక్రమము బానిస మనస్తత్వమును పోగొట్టి, సాంఘిక విప్లవతత్త్వమును ప్రవహింపజేసినాయి. హరిజన దేవాలయ ప్రవేశార్థమను సాధించుటకు కాంగ్రెస్ రాజకీయాధికారమును ప్రయోగింపజేసిన గాంధిజీ, బిజ్జలరాజు-బసవయ్య, ప్రధానిగారల చారిత్రాత్మక ఘట్టణానుస్మరణను తెస్తుంది. యింతటి మహత్తర సాంఘిక విప్లవమును కదుపుగట్టిన సనాతన హిందూ సమాజంలో తీసుకురా ప్రయత్నించి సఫలమొందుట సామాన్యమైన విషయము గాదు. బ్రాహ్మణీకమునకే రాజకీయ అధికారం వుండివున్నట్లయితే, వేదశాస్త్రాధిక్యత, వైదిక ధర్మ ఆధిపత్యము, బ్రాహ్మణ నియుక్త సాంఘిక వ్యవస్థలపై తిరుగుబాటు సాధ్యమయ్యేడిది గాదేమో.

వీటన్నిటినిబట్టి తెలుసుకోదగిన విషయములు ప్రాచ్యదేశములలో జరుగు సాంఘిక విప్లవములలో 'ఆర్థిక స్వభావం' అతిస్వల్పము. రాజకీయ శక్తిప్రభావంగూడ తక్కువ చేసినదియు, సాంఘిక విప్లవమార్గమధ్యమందు మాత్రమే రాజకీయశక్తి విప్లవశక్తులకు సత్వర విజయసాధనములో తోడైనదనిన్నీ తెలు

తున్నది. సాంఘిక విప్లవములు ఆర్థికే సంబంధమైన కారణములవల్లనే యేర్పడునని తలపోయుట భ్రమయనికూడ ప్రాచ్యప్రపంచ సాంఘిక విప్లవ చరిత్ర నిరూపించింది.

సాంఘిక విప్లవం దృష్ట్యాకూడ, భారత జాతీయ కాంగ్రెసు విప్లవ ధర్మము వీడలేదు.



# 9

## జాతీయత : అంతర్జాతీయత

జాతీయతను కారల్ మార్క్సు ఒక్క దృక్కోణమునుండియే పరిశీలించాడు. ఇతరదృక్కోణములనుండి జాతీయత నాయన పరికించలేదు. కావుననే "జాతీయత సంకుచితమైనదం"టూ "అంతర్జాతీయత"నే ఆదేశించాడు.

ఇరవై వేల సంవత్సరముల భారత నాగరికత అంతర్జాతీయతనుపదేశించుచునే యున్నది. "సర్వేజనా స్సుఖినోభవంతు" అను శ్లోకమేగాక, హిందూ ఆశ్రమ ధర్మము కూడ సర్వమానవ సౌభ్రాతృత్వమునే వుపదేశించుచున్నది. ఐనను బహుకొద్దిమంది మాత్రమే అంతర్జాతీయతను గుర్తించగల్గారు. అంతర్జాతీయత ప్రజల గ్రహణశక్తికి అతీతముగనే వున్నది.

ఇక అట్టి తరి ఇరువదియైదు సంవత్సరముల సోవియట్ రష్యా అంతర్జాతీయ ప్రబోధం ఫలించలేదంటే ఆశ్చర్యం చెందనవసరంలేదు. సోవియట్ యుద్ధ ప్రయత్నముల విజయమునకు, వుపకరించనందున, తోడ్పడు శక్తి, లేనందున, రష్యా అంతర్జాతీయతను గర్జించి, జాతీయతపట్ల వినూత్న భక్తిని వినూత్న అభిరుచిని కన్పరచింది రెండవ ప్రపంచ యుద్ధకాలమందు.

జాతీయత అభివృద్ధిశక్తి గాదా?

మెక్సికో రైతు – అధ్యక్షుడు కార్డినాస్ పరిపాలనానుభవము జాతీయత స్పష్టముగ విప్లవాత్మక అభ్యుదయ శక్తియని నిరూపించింది. రెండవ ప్రపంచ సంగ్రామకాలమందు సామ్రాజ్య ఆర్థిక శక్తులను వంగదీసి వ్యాసాయ సరకులకు అధికధరలు సాధించిన అర్జంటీనా ప్రభుత్వ అనుభవము

సామ్రాజ్యవాదుల అదనపు ప్రాదేశిక హక్కులను రద్దుపరిపించిన చైనా అనుభవము, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యప్రజాప్రభుత్వమును ఏర్పరచుకున్న బ్రెజిల్ అనుభవము, టర్కీ, ఈజిప్టు, ఐర్లాండు మున్నగు దేశముల అనుభవములు జాతీయత పురోగామి శక్తియని నిరూపించినాయి. ఆయా దేశములందు జరిగిన సాంఘిక, ఆర్థిక వ్యవస్థలమార్పులన్నియు జాతీయతా పునాదులపై ఆధారపడినవే.

కావున పతిత దేశాల జాతీయతే గాక, రాజకీయముగ స్వారాజ్యం పొందియున్న దేశములందు సైతం జాతీయత స్పష్టముగ పురోగామి శక్తియని విదితమైంది.

ఐతే జాతీయతను సామ్యవాదముతో సమ్మిళితపరచుకోవాలి. నాజీ పద్ధతిని గాదు, రష్యాపద్ధతిని గాదు, జపానీయ మిలిటరీ పద్ధతిని సైతం గాదు; వీటి దుష్ఫలితముల నిగనరకే తెలుసుకున్నాము గదా!

జాతీయతను సామ్యవాదముతో అహింసా, ప్రజాతంత్ర సూత్రములపై సమన్వయపరచిన గాంధీయ పద్ధతియొక్కటే సర్వోత్తమమైన మార్గం. అదే నిజమైన అంతర్జాతీయతా రాజమార్గం.

ప్రజలు, ముఖ్యముగ పతితదేశప్రజలు మున్ముందు జాతీయ చైతన్యము పొందుట ద్వారా సామ్రాజ్య వ్యతిరేకులై, అనంతరమే వర్గచైతన్యం పొందగలరని ఇండియా, చైనాల అనుభవము చాటుతూంది.

పాశ్చాత్య సోషలిస్టులు మార్క్సిస్టు సమ్మోహితులై జాతీయతా, సామ్యవాదములను సరియైన మార్గమున సమన్వయపరచ లేకపోయారు. జాతీయతా ప్రభావమును గుర్తించక జాతీయతా శక్తిని వారు పొందలేకపోయారు. సరిగదా, జాతీయతను ఏవగించుకున్నారు. దీనిని పురస్కరించుకొని, జాతీయతా నాలింగనం చేసుకొని, అంతర్జాతీయతా, సామ్యవాదములకు పోటీగా ప్రజల జాతీయతను ప్రయోగించి, సామ్యవాద పురోగమనము నరికట్టారు.

మార్క్సు పొరపాటు పడినట్లు, మనము పొరపడరాదు. మార్క్సిజము నవీనకాలంలో విమర్శింప చేసుకోవాలి. పాశ్చాత్య దేశముల అనుభవము ప్రకటించిన తప్పిదములనే మనము చేయగారాదు. మా ధనికవర్గముల చేతిలో జాతీయత పలిసం గాకుండా చూచుకొనుట మన పరమధర్మం.

ప్రజల జాతీయతను, సామ్రాజ్య వ్యతిరేకతను, ఆర్థికావసరములను కలిపి బలవత్తరమైన "సామ్యవాద జాతీయత"గ వేసిన గాంధీయ పథమే ఆదర్శ సామ్యవాద పథము.

---

# 10

## చైనా గుణపాఠము

డాక్టర్ సన్ యట్ సేన్ సూత్రములు జాతీయత, సామ్రాజ్యవాద వ్యతిరేకత, ప్రజాస్వామికములు చైనాలో జాతీయతా సామ్యవాదముల సమ్మేళనముకు బునాది.

క్యుమింటాంగ్ (చైనా జాతీయ పక్షం) లోని అన్ని బృందాలను కూడదీసి తన జీవితకాలంలో జాతీయపక్ష ఐక్యతను సన్ యట్ సేన్ కాపాడగల్గాడు. కాని సన్ మరణానంతరం క్యుమింటాంగ్ లో అంతఃకలహం ఆరంభమైంది. చంగ్ - కై - షేక్ ఒక బృందానికి, వాంగ్ - చింగ్ - లీ మరొక బృందమునకు నాయకులుగవుండి. అంతఃకలహాలు పెంచుకున్నారు. వీరి మనస్పర్థలు కమ్యూనిస్టులకొక అవకాశమైంది. చంగ్ కు యెదురుగా, వాంగ్ తో జేరి, క్యుమింటాంగ్ కలహాలను, జాతీయ అనైక్యతను అధికతరం చేశారు.

కాని త్వరలోనే కమ్యూనిస్టుల ద్రోహచింతనం బైటపడింది. క్యుమింటాంగ్ లోని రెండుబృందములును, 'జాతీయత సంరక్షణ' కొరకు యేకమై జాతీయతా విద్రోహమునకు బుద్ధిపూర్వకముగ తలపడిన కమ్యూనిస్టులను, క్యుమింటాంగ్ లో నుండి బైటకు పంపివేశారు. కమ్యూనిస్టులకు చేయూతనొసంగుతూ, రష్యా, అంతర్జాతీయకమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులుగ చైనాలో వుంటూ వచ్చిన బోరోడిన్, యం. యన్. రాయ్ గారలను దేశంనుండి వెళ్లగొట్టారు.

ప్రజల శ్రేయస్సుకు పాటుపడుపార్టీయని ప్రకటించుకొనుటకుగాను కమ్యూనిస్టుపార్టీ రైతాంగ అనుకూల కార్యక్రమమును అనుసరించింది

ఛంగ్ - కై - షేక్‌ను సామ్రాజ్యవాద యేజంటనీ, ధనిక వాదులకు తోడు నీడయని నిందించారు. రష్యా ఆదర్శరాజ్యమను ప్రచారం ప్రారంభించారు.

కాని "చైనా నవజీవనోద్యమం" ద్వారా తన రైతాంగానుకూలతను వ్యక్తపరచాడు ఛంగ్-కై-షేక్. సన్‌యట్ సూత్రములలో వొకటగు సామ్రాజ్యవాద వ్యతిరేకతే తన జీవితాశయని స్పష్టపరుస్తూ, సామ్రాజ్యవాదుల అధిక ప్రాదేశిక హక్కులు రద్దుకావాలను ఆందోళనమును ప్రారంభించాడు. జాతీయ ఐక్యసంఘటనావశ్యకత వున్నంతకాలం, బాధ్యతారహితముగ, స్వదేశీ ధనికవాదముపై ధ్వజమెత్తరాదంటూ, ప్రజను జాతీయ బాధ్యతలపట్ల ఉత్తేజపరచాడు

ఆదర్శ చైనాను నిర్మించుటకు గాను, కమ్యూనిస్టులవలె రష్యాను ఆయన ప్రమాణముగ తీసుకోలేదు. చైనా సంస్కృతి, సాంప్రదాయములందును, స్వయంపోషక ఆర్థిక విధానము, నవజీవనోద్యమముల పట్ల దృఢవిశ్వాసమును ప్రకటిస్తూ, సన్‌యట్ సేన్ ఆశయమగు సామ్యవాదము జాతీయత సమ్మేళనముద్వారా, ఆదర్శ చైనాను నిర్మించుతానని ప్రకటిస్తూ, చైనా ప్రజలను ఛంగ్-కై-షేక్ వుత్తేజపరచగల్గాడు.

ఛంగ్‌ను మించిన జాతీయ భక్తులమని కమ్యూనిస్టులన సాహసించిరే గాని, వారు సోవియట్ మానసపుత్రులని ఛంగ్ చాటగల్గాడు; లెనిన్ స్టాలిన్‌లు చైనా కమ్యూనిస్టులకు ఆదర్శులైయుండ, సన్‌యట్ సేన్ గారు తన గురువని ఛంగ్ ప్రకటించాడు.

"చైనా కమ్యూనిస్టుపార్టీ బాల్యదశలోనే ఆ పార్టీలోని కార్మిక బృందమునకు, రైతాంగబృందమునకు నాయకత్వం విషయమై ఘర్షణవచ్చింది. కార్మిక బృందనాయకుడు 'చెన్' చేతులో, రైతాంగ నాయకుడు 'మావో' ఓడిపోయాడు."

(ఎడ్గార్ స్నో రచించిన రెడ్ స్టార్ వోవర్ చైనా)

స్వానుభవముద్వార, గుణపాఠము జరుపనెంచాడు మావో. స్వరాష్ట్ర రైతాంగములో తీవ్రముగ పనిచేసి, దోపిడీగాండ్ర ఆట కట్టించాడు. గ్రామసీమలందు శాంతిభద్రతలను కాపాడాడు. అక్రమశిస్తులను, వ్యవసాయ ఋణములను రద్దుపరచి, భూమిశిస్తు తగ్గించాడు. జమీందారీ భూములను రైతాంగమునకు పంచివేశాడు. స్థానిక నియంతల పెత్తనమును తుదముట్టించి, రైతాంగ సైన్యమును నిర్మించాడు. ఇట్లు స్వయంకృషిద్వారా,

రైతాంగమును కమ్యూనిస్టుపార్టీలోకి ఆకర్షించాడు మావో. అందుకు 'మావో విధానము'నే చైనా కమ్యూనిస్టుపార్టీ అనుసరించిక తప్పినదికాదు.

ఇంత జరిగినా, చైనా ఎర్రరాష్ట్రములలో జాతీయతకు చేటు సంభవించు ప్రమాదమును ఛంగ్-కై-షేక్ అఘ్రాణించాడు. యెర్రచైనా రాష్ట్రములు రష్యాకు పంచమాంగదళముగ పరిణమించుననీ, రష్యా విస్తరణకవి రాజమార్గములగునని చంగ్-భయం. కావున కమ్యూనిస్టులనణచుటకు ఛంగ్-వుపక్రమించాడు.

ప్రపంచంలో రెండురాజ్యముల మధ్య ఒకే పెద్ద సరిహద్దు చైనా-రష్యాల సరిహద్దే. రష్యాభావజాలుల అధికారం బిఠాయించి యుండుచో, రష్యావిస్తరణకు మార్గంగాయగునుగదా? కమ్యూనిస్టుపార్టీ ప్రాబల్యముంటే, రష్యాతో తీక్షణమైన రాజకీయ సైనిక సంఘర్షణను కొనితెచ్చుకోవలసి వస్తేగదా? కావుననే రెడ్ చైనాను అదుపులో వుంచుకొనుట కుపక్రమించాడు. తన యీ ప్రయత్నములో తోడ్పడిన అమెరికా, బ్రిటన్, జపాన్ సామ్రాజ్యవాదుల సహాయమును స్వీకరించిన మాటనిజమే. కాని అదితప్పుకాజాలదనియె ఆయన నమ్మకం.

కమ్యూనిస్టులు తమ యెర్రరాష్ట్రములను వీడి, ఉత్తరయాత్ర సాగించి, సోవియట్ సరిహద్దున ఆనుకొనియుండు రాష్ట్రములలో పీఠంవేశారు. ప్రజల జాతీయత అండగా వున్నందుననే ఛంగ్-కై-షేక్ కు యీ వుద్యమంలో విజయం సంభవించింది.

ఉత్తరరాష్ట్రములలో కమ్యూనిస్టులెట్లు ప్రబలంగాగల్గారు? 'మావో అనుభవము వారికి అండయైనది. మావో సూచించిన రైతాంగ కార్యవిధానము" నమలుజరుపుటద్వారా, ఉత్తర ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నారు. ఇదంతా "బోల్షివిక్ పంథా" కాదను నమ్మకం హృదయములలో వున్నను, కాలోచితముగ, అంతరాత్మలోని "కార్మిక నియంతృత్వ" ఆశయమును అణచియుంచి, రైతాంగ కార్యక్రమము ననుసరించారు.

జపాన్ సామ్రాజ్యకాంక్ష పెరుగుటతో పాటు, చైనాలో జపాన్ వ్యతిరేకతగూడ వృద్ధిజెందుతూన్నది. జపాన్ వ్యతిరేకోద్యమంలో ఛంగ్-కై-షేక్ కు అండగా వుంటామని కమ్యూనిస్టులు హామీయిచ్చారు (ఈ సందర్భంలోనే ఛంగ్-కై-షేక్ ను కమ్యూనిస్టులు చెరపట్టుట వారితో ఛంగ్-రాజీ చేసుకొనుట జరిగాయి. జాతీయ ప్రజాభిమానము చూరగొన్న మరి

కాని చైనా కమ్యూనిస్టుల అనుభవము ప్రపంచానికి కొంత గుణపాఠమును మాత్రం సూచిస్తుందనక తప్పదు.

1 (అ) రైతులు విప్లవ కార్యాచరణను గడపగలరని, విప్లవాలు సాగించగలరని.

(ఆ) సైనికాది ఆర్గనైజేషన్ విషయములందును స్వనాయకత్వమును నిర్మించుకోగలరని.

(ఇ) క్రమశిక్షణ కల్గియుందురనీ, నైతిక శక్తి, సైనిక, విప్లవ శక్తిని నిల్పుకోగలరని చైనాకమ్యూనిస్టుల అనుభవం సూచించుతుంది.

ఐనప్పటికిని, నేటికి కూడ రైతుల ప్రాపంచిక విప్లవధర్మమును, రైతాంగ విప్లవావశ్యకత, ప్రాధాన్యతలను చైనా కమ్యూనిస్టులు గూడ గుర్తించ నొల్లరు; ఇదే చోద్యం!

2 జాతీయ జీవనంలో సంకుచిత దృష్టిగల విచ్ఛిన్నపోకడే కమ్యూనిస్టుపార్టీ పోతుంది. జాతీశ్రేయో దేశములకన్న, పార్టీప్రయోజనము, అవసరాలనే ఆపార్టీ ప్రధానముగ యెంచుననీ.

3 జాతీయైక్యత, జాతీయవిప్లవము, జాతీయ నాయకత్వములకు కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకమనీ.

4 ఒడంబడికలు కమ్యూనిస్టులకు తృణప్రాయం. ఛంగ్ -కమ్యూనిస్టు ఒడంబడికకు భిన్నముగ ప్రవర్తించాయి.

5 ప్రతివిషయమందును, రష్యాఆజ్ఞలనే కమ్యూనిస్టుపార్టీ పాటించుననీ, రష్యానే ఆపార్టీ అనుసరించుననీ.

6. రాష్ట్ర రాష్ట్రములలోను జొరబడి, స్వయం నిర్ణయమను పేర కమ్యూనిస్టుపార్టీ దేశమును బలహీనపరచి, ఛిన్నాభిన్నం చేయుననీ, చైనా కమ్యూనిస్టుపార్టీ, చరిత్రే ప్రకటించుతుంది.

కార్మిక వర్గపార్టీ అని కమ్యూనిస్టుపార్టీ చెప్పుకొంటుంది. కాని "యుద్రచైనాలో, యుద్రదనం, శూన్యం" అని ఎడ్గర్ స్నో 'భూగర్భ విధానం' అను గ్రంథంలో పేర్కొన్నాడు. కాని యుద్రదనంశూన్యమైనను, రైతాంగ కార్యక్రమం అనుసరించి, జాతీయతను కల్గియున్నట్లు నటించినా, రైతాంగ మనస్తత్వం లేక, సోవియట్ రాజ్యాంగరథమునకు తోకగ మాత్రమే చైనా

# 11

## రైతులసవాల్

మానవ సమాజ జీవితంలో, మొదటి నుండియు, కొద్దిశ్రమతో, యంత్రపరికరముల సహాయమున, జీవితావసర వస్తుసముదాయమును చేకూర్చుకొను ప్రయత్నములు జరుగుచునే వున్నాయి.

చేతితో, చిన్న చిన్న పరికరములతో, ప్రారంభమైన వస్తూత్పత్తి, యంత్రాగారములలో వుత్పత్తి చేయుటకు మారింది. యంత్ర సహాయమున, అనేక రెట్లు అధికోత్పత్తి సాధ్యమైంది.

కొన్ని సందర్భములందు మాత్రమే మానవశక్తిని భద్రపరచుటకు యంత్రసహాయము వినియోగింపబడినది. యంత్రోత్పత్తి, గనులు, లోహపరిశ్రమలు రైల్వే, నౌకాపరిశ్రమలు మున్నగు భారీపరిశ్రమలలో యంత్ర, విద్యుచ్ఛక్తులు అధికము. మానవశక్తి ప్రయోగము స్వల్పము.

గృహపరిచర్యలు, ఆఫీసులు, హోటళ్లు, వంట మున్నగు అనేక పరిశ్రమలందు యాంత్రిసాధనములు ప్రయోగకారకావు మానవశక్తి ప్రయోగింపవలసియే వున్నది

వేదకాలంలో యంత్రాగారములందును, యంత్రేతర పరిశ్రమలందును పనిచేయు శ్రామికులశక్తికి సమాన[illegible] లభించెడిది. ప్రతివారిదీ శ్రమయేగదా? ఎల్లరు సమాజంలో జీవించు మానవులేగదా? అందరికీ కనీసజీవితావసరములు లొనగూడ వలసినదేగదా? ఈ సద్బుద్ధి అకాలమందు వున్నది. కాని నేడంతయు తారుమారైంది. యంత్రపరిశ్రమలు, వ్యాపార నిపుణతగలదేశాలు స్వార్థమునకు తలపడ్డాయి. "చిన్నన బొజ్జకు శ్రీరామరక్ష" అని జపంచేస్తూ, అన్యదేశములను దోపిడి చేయనారంభించాయి కావుననే నేడు ప్రపంచసంపద, దేశదేశాలమధ్య సక్రమముగ, న్యాయముగ పంపిణీయగుటలేదు. వ్యవసాయము, గృహపరిశ్రమలపై ఆధారపడు దేశాలు ప్రపంచసంపదలో స్వల్పభాగమును మాత్రమే పొందగల్గుచున్నాయి వారి కృషికి న్యాయతః లభింపవలసిన ఫలితంలో అధిక భాగమును పారిశ్రామిక దేశాలు దోచుకుంటున్నాయి. ప్రపంచ మార్కెట్లు, అసమాన మారకపు విధానముల రూపేణా

యంత్ర పారిశ్రామిక దేశాలు తమ యీ దోపిడీ విధానమును కొనసాగిస్తూ, పారిశ్రామికేతర దేశాలను, పారిశ్రామిక దేశాలు బాహాటముగ లూటీ చేస్తున్నాయి.

పారిశ్రామిక, వ్యాపార దేశముల ధనికవర్గము తో యీ దోపిడి సాగించుటలేదు వారి నడుపెట్టుకొని, ఆ యా దేశాలలోని అన్ని వర్గములు, కాస్తగనో, హెచ్చుగనో యీ దోపిడివిధానంలో, తెలిసిగాని, తెలియకగాని, భాగస్వాములౌతున్నారు.

ప్రపంచసంపద పంపకములో యీ అసమానత్వం అంతరించాలి. దేశదేశాల మధ్య ప్రపంచసంపద సక్రమంగా, న్యాయముగ పంపకం గావాలి. అట్లే జాతీయసంపదలోగూడ అన్నివర్గములకు న్యాయమైన భాగం లభించాలి.

పారిశ్రామిక దేశాలలో, పరిశ్రమలందు నిమగ్నులై యుండు కార్మికులతో, వ్యవసాయ దేశములందు వ్యవసాయము, యితర చేతిపరిశ్రమలందు పని చేయువారికి సమాన ప్రతిపత్తి దొరకాలి. శాస్త్రపరిజ్ఞానం కల్గించు నూత్న ప్రయోజనములు అన్ని దేశములకు లభించాలి శాస్త్రపరిజ్ఞానము యేదొక్క దేశానికిగాని, యేయొక్క వర్గానికిగాని సొత్తు గారాదు.

వ్యవసాయ దేశములు జనసంఖ్యలో (మానవశక్తి) అధికులు. పారిశ్రామిక దేశములు యంత్రశక్తి ప్రయోగమందధికులు. కాని యంత్రశక్తి కెంతవిలువగలదో, మానవశక్తికినీ అంతే విలువగలదు కాన మానవశక్తి కొల్లలుగ వున్న దేశములందు యంత్రప్రయోగమును పరిమితపరచాలి. యంత్రశక్తివినియోగము పరిమితపరచబడిన వ్యవసాయదేశాలకు యంత్రశక్తి నపరిమితముగ వినియోగించు పారిశ్రామిక దేశాలకు ప్రపంచసంపదలో, జనసంఖ్యానుగుణ్యముగ భాగం లభించాలని, సర్వమానవ సౌభ్రాతృత్వము నాశించువారు కోరి సాధించవలెను.

వివరణ : అమెరికా, యింగ్లాండు దేశాలను వుదాహరణగ తీసుకుందాం. పరిశ్రమలే ప్రధానముగ గల్గివున్న ఆ దేశాలు, ప్రపంచసంపద పంపకంలో వున్న అసమానతవల్ల అధికలాభములను గడించుతున్నాయి. భాగమును అధికంగా పరిశ్రమలలో పనిచేయువారే గాక, వ్యవసాయదార్లు, గృహపరిచారకులు మున్నగు వివిధవర్గములుగూడ పొందుతున్నాయి. శ్రమజీవుల భాగము తక్కువగ వుండవచ్చు, కాని అసలు దోపిడిధనంలో భాగంలేకపో

బహుస్వల్పమైన మానవశక్తి సహాయంతో, యంత్రములద్వారా విశేషముగ వస్తుసముదాయమును వుత్పత్తి చేయుచున్న తద్వారా లభించు లాభము నింతవరకు పారిశ్రామిక ప్రజలే అనుభవిస్తున్నారు. పారిశ్రామిక విధానం సమకూర్చెడు లాభములలో, కొంతభాగం, రైతులకు ముట్టచెప్పటానికి ఇష్టగించనిచో, పారిశ్రామిక విధానమే మూలబడునని 1929–35 ఆర్థికమాంద్యం, అమెరికాలో గుణపాఠంగరిపింది. పరిమితరహితముగా, హద్దూపద్దూలేకుండా రైతులను పారిశ్రామిక విధానం దోపిడి చేయుటకే తయారగుచో, రైతులు దివాళాయెత్తుటవల్ల పారిశ్రామిక వస్తువులు విడుదలకాక పోవటం, తన్మూలమున బ్యాంకులు విచ్ఛిన్నంగావటం, ప్రపంచ ఆర్థికమాంద్యం యేర్పడటం తథ్యమని '1929–35 ఆర్థికమాంద్యం' హెచ్చరించింది.

ఆర్థికమాంద్యమునకు డబ్బు, మారకము, సుంకములు, పారిశ్రామిక నిరుద్యోగము, అధికవస్తూత్పత్తులే కారణమని ఆర్థిక శాస్త్రవేత్తలు యింతవరకు నీతులు చెప్పారు. ఛాందస సోషలిస్టులుగూడ యివే ఆర్థికమాంద్యములకు కారణములని ప్రచారం చేశారు అంతేగాని రైతుకూలీలను హద్దుపద్దులేకుండా దోపిడిచేయుటవల్ల క్షీణించిన రైతాంగ కొనుగోలుశక్తి మూలమున ఆర్థికమాంద్యము యేర్పడుతున్నదని గుర్తించలేకపోయారు. ఇంతటనైన ఆర్థికమాంద్యములకు మూలకారణమును గుర్తింతురుగాక!

ఆర్థిక మాంద్యము తెచ్చిపెట్టిన దుస్థితినుండి ప్రజలకు రక్షణకల్పిస్తానన్న అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్టు యీ మూలసూత్రమును గుర్తించినట్లుంది. కావుననే తన "న్యూడీల్ ప్రణాళిక" ద్వారా వ్యవసాయ పంటల ధరను నూటికి రు 25 లు చొ॥న పెంచాడు. వ్యవసాయ పంటలకు కనీస ధరలు హామీయిచ్చాడు. విదేశాలనుండి, స్వదేశీవ్యవసాయ పంటలతో పోటీకి దిగుమతయ్యే పదార్థములపై విధించు సుంకములను పెంచాడు వ్యవసాయ పథకము ననుసరించి, పంటభూముల విస్తీర్ణమును తగ్గించుకో వలసివచ్చిన రైతులకు పరిహార మొసంగాడు.

ఇట్లు వ్యవసాయ సరుకులకు పెంచబడిన ధరలెవరిచ్చుకున్నారు? పారిశ్రామిక, వాణిజ్యవర్గములే! లేకుంటే పారిశ్రామిక, వాణిజ్యములే మూలపడతాయి; బ్యాంకులే దివాళాదీస్తాయి; నిరుద్యోగం ప్రబలమౌతుంది రైతులు కట్టుగట్టి తమ ఆహారపదార్థాలను విక్రయించకుండా వుంటే తాము మలమలమాడవలసివస్తుంది. కాబట్టి స్వక్షేమ లాభముల కొరకైన, పారిశ్రామిక వాణిజ్యవర్గములు వ్యవసాయ పంటల కధికధరలొసంగుట కంగీకరించక

తప్పిందిగాదు. పారిశ్రామిక విధానం తనకు దోచిపెడుతున్న కోట్లకొద్ది లాభములోనుంచి, రైతుల పంటలకు యీ అధికధర లిస్తున్నారు.

ఆర్థికమాంద్యము వెనుకొర్కాను యీ నూతనపథకము ద్వారాను అమెరికన్ ఆర్థిక విధానం తట్టుకోగల్గింది దీనికి కారణం? అమెరికాలో నూటికి 50 మంది వరకు పారిశ్రామిక, వాణిజ్య విధానాలకు చెందినప్రజలే. కానపారిశ్రామిక, వాణిజ్యవిధానములు దోచిపెట్టే డబ్బు పుష్కలంగా వారి వద్ద వుంది.

దీనివల్ల మనకు తెలుస్తున్న విషయాలు:— ధనికవాద సమాజములో గూడ, పారిశ్రామిక, వాణిజ్యవిధానములు చేకూర్చులాభంలో, రైతులకు భాగము లభించజేసినట్లు సాధ్యమగును. రైతాంగమునకు యిట్లు భాగంపంచి యివ్వటం పారిశ్రామిక, వాణిజ్య వర్గముల క్షేమము దృష్ట్యాగూడ తప్పనిసరియే యగును.

అమెరికా ఆర్థిక శాస్త్రాధిపుడు "మర్రెంతు" "భాగ్యము, నిర్భాగ్యము రెండును అవిభాజ్యం, సమాజంలో యే ఒక్కవర్గముగూడ, ఇతరులు దరిద్రంలో వుంటుంటే, తాను మాత్రం శాశ్వతంగా, భాగ్యవంతముగ వుండజాలదు" అని చక్కగ సూత్రీకరించాడు.

ప్రపంచ సంపద పంపకములో పారిశ్రామిక వాణిజ్యదేశాలు, వ్యవసాయ దేశాలమధ్యగల అసమాన తారతమ్యంలో, పారిశ్రామిక సంపద పంపకంలో యాజమాని — కూలీ వర్గముల మధ్యనుండు తారతమ్యం అవగింజంత మాత్రమే. పాశ్చాత్య సోషలిస్టులు, మార్క్సిస్టులు మానవ సమాజంలోని యీ అవగింజంత మచ్చమాత్రమే అంతమొందాలని, అదే బ్రహ్మాండమైన సమస్య అనీ లోకానికి చాటారు.

మానవ సమాజానికి వున్న పెద్ద మచ్చను. పారిశ్రామిక మనస్తత్వజ్ఞులకు వ్రేలెత్తి చూపుతూ, మహాత్మాగాంధి, తదితర ప్రాచ్యసోషలిస్టులు, యీ పుట్టుమచ్చనే అంతమొందించ గడంగుట ద్వారా నిజమైన, నిష్కల్మషమైన సోషలిజమును రాజమార్గమున నడుపుతున్నారు.



# 13

## అసమాన పంపకము

ఆనాటికాలంలో, గ్రామ స్వయంపోషక ఆర్థిక విధానం అమలులో వుండేది. అంటే గ్రామమే 'యూనిట్'గా వుండు ఆర్థికవిధానము ఆచరణలో వుండెదన్నమాట. తర్వాత క్రమంగా వివిధగ్రామాల యూనిట్లమధ్య ఇచ్చిపుచ్చుకోటాలు (బార్టర్ సిస్టం) ఆరంభమైంది. దీనివల్ల క్రమంగా బస్తీలు యేర్పడ్డాయి. నాటి గ్రామప్రజలు తమ జీవితావసర వస్తువులన్నింటిని తమకు తామే వుత్పత్తి చేసుకుంటూ, బహుకొద్ది సరుకులమాత్రం బయట ప్రాంతాలపై ఆధారపడి వున్నాయి. బస్తీలు బహుకొద్ది రకముల సరుకులుమాత్రం వుత్పత్తిచేస్తూవచ్చాయి. దీనివల్ల, కాలంలో పల్లెలకు బస్తీ అవశ్యకత కన్నా బస్తీ పల్లెలపై ఆధారపడుట సంభవించింది. పల్లెలనుండి అనేకరకముల సరుకులు తెచ్చుకోవలసిన బస్తీలలోనే వర్తకపు-వర్గం వుద్భవించింది.

గ్రామాలలో కండ్లు చెదిరిపోయే ధాన్యరాసులుంటుండేవి. గ్రామీణులు కొనుగోలు చేసుకోవలసిన వస్తువులా చాలాస్వల్పం. ఇట్లు ధన, ధాన్యరాసుల మధ్య ఓలలాడుచున్న గ్రామీణులు, బేరమాడు స్వభావమునలవరచుకోలేదు. అట్టి అవసరం వారికి కాన్పించలేదు. తమకవసరమైన వస్తువులకు విపరీతమైన అధిక ధరలొసంగగల 'దర్జాపోడాలలో' వున్నారు. కావుననే తమ కవసరమైన వస్తువులకు విపరీతమైన కొద్ది సరకులకు బాలుగా పుట్లకు పుట్లధాన్యరాసులు కొల్పోయారు. ఆర్థిక పరిభాషలో దీనిని చెప్పాలంటే రైతులు తమ ధాన్యానికి నామమాత్రపు ధరతోనే సంతుష్టులయ్యారు. ఇక బస్తీలవారికి బేరమాడుకో వలసిన స్థితియేర్పడ్డది. కావుననే బేరసారాలలో ఆరితేరారు బస్తీ వణిక్ ప్రముఖులు. ఇట్లు అసమాన ధరల సూత్రముపై వ్యాపార సరళి ప్రారంభమైంది, క్రమంగా యీవిధానమే చిరస్థాయి అయింది. వ్యవసాయవస్తువులకు స్వల్పమైన ధరలు, వ్యవసాయేతర వస్తుసముదాయమునకు అత్యధిక ధరలు విధాన మీవిధంగా బయలు దేరింది.

ఆర్థిక జీవనంలో వ్యాపారస్థుడు 'దళారి' పాత్రనుమాత్రమే నిర్వహించును. 'దళారి' నిష్పక్షపాతముగ తన వ్యాపారమును నిర్వర్తించవలెను. కాని వ్యాపారులు తమ ధర్మమును నిర్వర్తించలేదు. బస్తీ అవసరముల కొరకు

యేర్పడిన బస్తీవ్యాపారి బస్తీపక్షపాతియై, బస్తీలకు అనుకూలముగను, రైతాంగమునకు ప్రతికూలముగను, తన వ్యాపారవిధానము నేర్పరచాడు. వ్యాపారస్థలములు (మార్కెట్లు) రైతులకు ప్రతికూలముగ పరిణమిల్లినాయి. వ్యాపారవిధానమందు రైతులకు అనుభవంలేకపోవటం (వారికా అగత్యం లేనట్లు కల్పించుటే కారణం) వ్యాపారసూత్రములందు బస్తీలవారు ఘటికులవటంమూలాన అసమాన మారకవిధానం స్థిరమైపోయింది. ఆ కాలమందు భారీయెత్తు పరిశ్రమలు లేనందున, పారిశ్రామిక వస్తూత్పత్తి స్వల్పముగనే వుంది. ఈ కారణమునగూడ పారిశ్రామిక వస్తువులకు అధికధర లేర్పడివుండవచ్చు.

యంత్రపారిశ్రామిక వస్తువులకన్న చేతిపరిశ్రమల వస్తువుల ధరలు తక్కువగ వున్నంతకాలం, అవి అత్యధికంగా అమ్ముడుపోయి, పారిశ్రామిక వస్తు విక్రయ లాభంలో అధికభాగం చేతిపరిశ్రమలకు చెందుతూవచ్చింది. ఎన్నడుగూడ చేతిపరిశ్రమల వస్తువులధరలు, యంత్రపారిశ్రామిక వస్తువులను విసర్జింపజేయగల్గునంతగా, స్వల్పముగా లేదు. శాస్త్రపరిజ్ఞానం పెంపుదలతో, యంత్రపరిశ్రమలు చేతిపరిశ్రమలతో పోటీచేయగల్గుటేగాక, చేతిపరిశ్రమలకన్న యంత్రోత్పత్తి వస్తువులను చవుకగా యివ్వగల్గారు. క్రమంగా చేతిపరిశ్రమలకు ప్రోత్సాహంతగ్గి, యంత్రపరిశ్రమలు యేలుబడి ప్రారంభమైంది. యంత్రపరిశ్రమలకు ముఖ్యాధారమైన ముడిసరుకులకు స్వల్పధరలివ్వటా, యంత్రోత్పత్తి సామగ్రిని అధికధరలకు విక్రయిస్తూ, అసమాన మారక విధానమును ద్విగుణీకృతం జేశారు. యంత్రపరిశ్రమల వునికి, పెంపుదలకు యిదేమూలం.

ప్రపంచ మార్కెట్లు, అంతర్జాతీయ వాణిజ్యము, పెట్టుబడులను తమ పిడికిలిలో బిగించుకొన్న ప్రపంచధనికవాదమునకు వ్యవసాయ సరకులధరలపై నియంతృత్వాధికారం లభించింది.

నేడు పాశ్చాత్య, పారిశ్రామిక దేశాలు కుబేరులమయమగుటకు కారణం—ఆదేశము లందలి కార్మికుల కష్టాన్ని దోచుకొనుట మాత్రమేగాదు. అసమానమైన, అన్యాయపు మారక విధానంపేర జరుగుతున్న 'బహిరంగలూటీ' వల్లనే ఆదేశాలు బంగరు టుయ్యాలలందు వూగుతున్నాయి. దారుణమైన యీ 'సాంఘిక అరాచకము' అను రాచపుండునకు శస్త్రచికిత్స జరగనిదే ప్రపంచ ప్రజాభ్యుదయము చేకూరదు. ఇది జరగనంతకాలం సాంఘిక విప్లవం సమగ్రం కాజాలదు. సుస్థిర ప్రపంచశాంతి చేకూరదు. అసమాన మారక విధానము నంతమొందించవలసిన ఆవశ్యకత ఇప్పుడిప్పుడేగుర్తింపబడుతున్నది. ఈ

అసమాన మారకంపేరజరుగు బహిరంగ లూటీ అంతమందనంతకాలం పారి శ్రామిక దేశాలమధ్య, శ్రామికప్రాక్ పశ్చిమ దేశాలమధ్య, తెల్ల, నల్లరంగు జాతులమధ్య యుద్ధకారణం అంతమందదు.

దక్షిణఅమెరికా రైతునాయకుడు డాక్టర్ పాసెలో, బాల్కన్ రైతు నాయకులు రాడిక్, మిలియాన్, స్టిబిచెరిఫ్ ప్రభృతులు అసమాన మారక విధానంవల్ల రైతులకు జరుగుచున్న దురన్యాయమును అంతమందించ బూను కున్నారు.

అసమాన మారకవిధానంఫలితంగా ప్రపంచసంపద పంపకంలో జరుగు చున్న అన్యాయాన్ని మహాత్మాగాంధి గుర్తించాడు కీ॥ శే॥ సన్‌యాట్ సేన్ ఇది అంతమొందాలన్నాడు.

ఈ దురన్యాయము నంతమందించుటకు గాంధిజీ మార్గంగూడ చూపా డు ప్రపంచ రైతాంగమునకు.

1. ప్రపంచ మార్కెట్లపై ఆధారపడవలసిన దుస్థితి తొలగించు కోవాలి, కనీసం ప్రపంచ మార్కెట్లపై అధారపడుటను తగ్గించుకోవాలి.

2 గ్రామ, జిల్లా, రాష్ట్ర, దేశీయ స్వయంపోషకత్వమును సాధించు కోవాలి, పెంపొందించుకోవాలి.

3 గృహపరిశ్రమలను సహకారపద్ధతిని, కీలకపరిశ్రమలను ప్రభుత్వ యాజమాన్యమున యేర్పరచుకోవాలి.

4. వర్తక, వాణిజ్యాదులు ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహించు కుంటూ, అంతరంగికముగ మారకపురేటులలో సమత్వం చేకూర్చుకోవాలి

ఇట్లు తమ విధానమును రైతులు నిర్ణయించుకొని, నిర్వహించుచో, ప్రపంచమార్కెట్లపై ఆధారపడవలసిన అవశ్యకత తగ్గిపోయి, అసమాన మార కము ప్రశ్నే పుద్భవించదు.

కాని రైతులలో ఇంతటి చైతన్యంగాని, సంఘటనాశక్తిగాని నేడు లేదు పన్నులభారము, ఋణముల, అనేక జీవితావసర వస్తువుల కొనుగోలు చేసుకోవలసినస్థితి ... యివన్నీగూడ డబ్బు సంపాదించుకొనుటమీదనే రైతుల ధ్యానమును లగ్నపరచాయి ప్రపంచమార్కెట్ల దోపిడివిధానం పుణ్యాన ఆహారపంటలకన్న వ్యాపారపంటలకు కొద్దిపాటి అధికధర కల్పిం చుటే మహాప్రసాదముగ భావించి, వ్యాపారపంటలు పెట్టుటద్వారా

ప్రపంచమార్కెట్లో ఈచ్చులో తలదూరుస్తున్నారు రష్యా రైతుకోసం. ఈ దుస్థితినుండి రైతు లివ్వాళిప్పుడే చైతన్యవంతులౌతున్నారు.

వ్యవసాయ ప్రజలపై, వ్యవసాయేతర వర్గములు జరిపిన ఆర్థిక దండయాత్రలు.

1 1920 _ 22 మధ్యకాలంలో, రష్యన్ రైతాంగముపై సోవియట్ కార్మికవర్గ దండయాత్ర. నిర్బంధధాన్యసేకరణ, పంటలకు వేరు చౌకధరలు.

2 1935 _ 37 ఆర్థిక సంక్షోభం.

3. బ్రిటిష్ సామ్రాజ్య ఆర్థికవిధానం.

4. సోవియట్ బస్తీప్రజలను, కార్మికవర్గమును పోషించుటకై రష్యన్ రైతాంగం ఎట్లు పొట్టగట్టుకొన్నదో, అట్టి దుస్థితికే భారతరైతాంగం, రెండవ ప్రపంచ యుద్ధకాలమందు, గురియైంది. వ్యవసాయేతర వస్తువులకు వ్యవసాయవస్తువులపై నాల్గురెట్లు అధికధర అని విస్మరించరాదు.

# 14

## తనగొయ్యి తానే....

ప్రపంచమంతటా సమిష్టి రైతాంగ ఆర్థిక విధానం వ్యాపిస్తున్నది. జమీందారీ విధానమును, ప్లాంటేషన్ (తెల్లదొరల కాఫీ, తేయాకు తోటలు) విధానమును నిల్పుటకు "లిన్ లిత్ గో కమిషన్" వ్యర్థప్రయత్నాలే చేసింది.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం బాల్కన్ దేశములందు జమీందారీ విధానముపై రైతులు తిరుగుబాటు చేశారు. రుమేనియా, యుగోస్లేవియా, బల్గేరియా, పోలెండు దేశాలరైతులు, జమీందారీలను స్వాధీనపరచుకొని, జమీందారీ భూములను పంచుకున్నారుగూడ.

ఈ రైతాంగ విప్లవ విజయానికై, ఆయా దేశాల రైతులు చేసిన త్యాగం అనన్యం. వేలాది రైతులు, రైతుసేవకులు హత్యచేయబడ్డారు. మర్రి

వందల మంది 'చిత్రవధ'కు గురియైనారు. ఎన్ని కష్టములూ, నష్టములూ, ఘోర విపత్తులు సంభవించినా, రైతుల విప్లవతృష్ణ నీగిపోలేదు సరిగదా విజృంభించింది.

బాల్కన్ రైతాంగం రాజకీయములలోగూడ ప్రధాన శక్తిగ విజృంభించింది. కాబట్టే బాల్కన్ దేశాలు నియంతృత్వమును గాక, ప్రజాస్వామిక మార్గమున రాజ్యాంగం నిర్మించుకున్నాయి. కార్మికవిప్లవములను (వియన్నా) అణచి వేయగల్గిన ఫాసిజముగూడ రైతాంగపు విప్లవవిజయమునుత్రుంచివేయ లేక పోయింది. దీనినిబట్టి విప్లవ విజయమును. స్థిరీకరించుకొనుటలో కార్మికులకన్నను రైతులే అధికతర పట్టుదల, నేర్పు, శక్తి, బలములను ప్రదర్శించ గలరని తేలింది.

బాల్కన్ రైతాంగం తన రాజకీయ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంది. రైతుల పార్టీలు, రైతుల నాయకత్వమున యేర్పడ్డాయి. కొన్ని దేశాలలో రాజకీయాధికారమును సైతం చేపట్టగల్గారు. (బల్గేరియా) విప్లవవ్యాఘాతుక వర్గములు ప్రజాస్వామిక పద్ధతిని ఇక రైతులను ఓడించలేవు.

ఇక రైతులు విప్లవదళాగ్రగాములు గాజాలరను కమ్యూనిస్టుల 'మొండి నింద'ను గూడ, బాల్కన్ రైతాంగం, ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలపు స్వానుభవముద్వారా, చక్కని ప్రత్యుత్తర మిచ్చింది. బాల్కన్ రైతాంగము నాజీజమునకు దాసిలొగ్గక, గొరిల్లా సైన్యనిర్మాణము ద్వార రహస్య ప్రతిఘటనోద్యమమును సాగిస్తూ, తమ జాతీయకాంక్షీక ప్రభుత్వాలకు అండగా యున్నది. మిత్ర, పురోగామి దళాలతో సంపూర్ణముగ సహకరించారు నాజీజము నంతమొందించుటలో.

ప్రపంచ మార్కెట్ల ఆధిపత్యమును ప్రశ్నించింది, బాల్కన్ రైతాంగం. యుద్ధానికి పూర్వమే దేశీయపంటలకు పోటీగా విదేశాలనుండి (అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా) గోధుమ, వరి, మాంసం మున్నగు ఆహారపదార్థాలు దిగుమతి గాకుండ చేసుకున్నారు. వ్యవసాయ పంటలకు, బాల్కన్ రైతాంగం, కనీసధర హామీ పొందింది. సహకార మార్కెటింగ్ సౌకర్యాలు శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులను పెంపొందింప జేసుకున్నది.

రైతాంగ ఆర్థిక విధానముకున్నూ, సహకారోద్యమానికిన్ని కలయిక కుదరదని కారల్ మార్క్సు, వెబ్సుగారలు దురభిప్రాయ పడ్డారు. కాని ఐర్లెండు, డెన్మార్క్, జపాన్, ఫ్రాన్సు, ఇటలీ, అమెరికా, ఇండియా దేశాల

అనుభవం, వారిది దురభిప్రాయమనియు నిరూపించినాయి. పారిశ్రామిక, వాణిజ్య రంగములందు సహకార విధాన మెట్టిసత్ఫలితముల నొసంగునో, అట్టి సత్ఫలితములనే సహకారము రైతాంగ ఆర్థిక విధానములో సైతం చేకూర్చును. రైతాంగ విధానంలోనే సహకార విధానం పరిపూర్ణత్వము నందగలదు.

ప్రపంచ సంపద పంపకంలోని అసమానత్వం 'రైతాంగ విలయము'కు ఒక బాహ్యలక్షణ మని కొందరు పొరపడవచ్చు. కాని నిజానికి యీ అసమానత్వముకు మూలమైన ప్రపంచ మార్కెట్లు, అసమాన మారక విధానములే రైతాంగ విప్లవధాటికి విచ్చిపోతున్నాయని, నవ్యయుగ ఆర్థిక చరిత్ర నిరూపించుతోంది. 1929_35 ఆర్థిక మాంద్యమును, దాని ఫలితములను శాస్త్రీయ దృక్పథముతో పరికించువారికి నగ్నసత్యం గోచరించక పోదు.

రైతాంగ ప్రజలను దోచుకొను విధానముపై ఆధారపడిన పారిశ్రామిక వాణిజ్య దోపిడి విధానము తన వునికి కొరకు, తన మనుగడ కొరకై రైతుల పంటలకధిక ధరలొసంగుట కంగీకరించుట ద్వారాను, జాతీయ స్వాయం పోషక విధానమును గుర్తించుట ద్వారానూ, తనగొయ్యిని తానే త్రవ్వుకుంటున్నది. ఇట్లు ప్రపంచ ధనికవాదదోపిడి అస్త్రములు, రైతుల రొంపట, మొండికత్తులైనాయి. రైతాంగమే విజయమందు తున్నది.



# 15

## రైతాంగ చైతన్యం

రైతులు విప్లవవ్యాఘాతకులుగ మారుతారనీ, కార్మికులే నిజమైన విప్లవకారులనీ, కారల్ మార్క్స్ బోధలకు లోనై, రష్యాలో రైతులను విభజించి పరిపాలించే సూత్రమును ప్రవేశపెట్టాడు లెనిన్.

రైతులను మూడుబృందములుగ చీల్చాడు. ధనిక రైతులు, సామాన్య రైతులు, బీదరైతులు అని. బీదరైతులు విప్లవానికి తోడ్పడేట్లు, సామాన్య రైతులు తటస్థంగా వుండేట్లు చేసి, విప్లవాన్ని కొనసాగించ గడంగాడు లెనిన్. ఇట్లు రైతులను బృందములుగచీల్చి, రైతులు తమ వర్గనాయకత్వమును కోల్పోయేట్లు చేశాడు.

దీనికితగినట్లుగనే, రష్యన్ రైతులుగూడ, సోషల్ రివల్యూషనరీ, నారోడ్నిక్ బృందాల రాజకీయ నాయకత్వముక్రింద విభజింపబడ్డారు. రైతులలో రాజకీయ వర్గసమైక్యతలేనందున, 1917 విప్లవ విజయానంతరం, రైతు, కూలీ నియంతృత్వములల్లా కార్మిక నియంతృత్వముగా లెనిన్ మార్చివేయగల్గాడు.

సోషలిస్టు పునర్నిర్మాణ దశలోసైతం రైతులు దైన్యస్థితిని వెళ్లబోయవలసివచ్చింది రైతుల రాజకీయహక్కులను, ఆర్థిక అవసరములు అలక్ష్యం చేయబడ్డాయి.

రైతుల విప్లవపాత్ర విషయమై, మార్క్స్ సిద్ధాంతవ్యామోహితులకు, సంకోచములుండబట్టే కమ్యూనిస్టులు దక్షిణఅమెరికాలో గాని, ఇండియాలో గాని, రైతాంగ హృదయమును చూరగొనలేకపోతున్నారు.

రైతుల విప్లవపాత్ర విషయమై మార్క్స్ శంకించుటద్వారా, పొరపడుటకు హేతువేమి?

ఆయనకాలంలో, రైతులపై ప్రపంచమార్కెట్ల దుష్ప్రభావం స్పష్టంగాగాని, లీలామాత్రముగగాని, గమనింపతగిన మహామ్మారిగ పరిణమించలేదు ధనికవాద, పారిశ్రామిక విధానముల పరిణామమును గురించి యోచించ ప్రయత్నించినచో, రైతులపై ప్రపంచమార్కెట్ల ప్రభావము విషయమై

జోస్యం చెప్పగలిగినవాడే. కాని కార్మికవర్గము, పారిశ్రామిక విధానములపై ప్రపంచమార్కెట్ల ప్రభావమును గురించిన ఆలోచనలతోనే ఆయన మునిగి తేలుతున్నందున, రైతులపై ఆయన దృష్టి ప్రసరించలేదు.

గ్రామీణ స్వయంపోషక విధానమునుండి, (ప్రపంచమార్కెట్ల వలయంలోకి) బాహ్యప్రపంచంలోనికి రైతాంగం వస్తూన్న సాంఘికమార్పుకు ఆయన స్వాగతమిచ్చాడు. వాణిజ్యపంటల పండిస్తూన్న రైతులు క్రమంగా కార్మికులుగా మారిపోవాలని ఆయన ఆశించాడు. వాణిజ్యపంటలకు రైతులు యెగబ్రాకటం 'అభివృద్ధికరమైన' మార్పని సంతోషించాడు? దీని ఫలితముగ రైతువర్గమే నశించి, రైతులంతా కార్మికులుగ సహజపరిణామ మందుతారని యీ నూత్నపరిణామమును రైతులు ప్రతిఘటించుతారనీ, అందువల్లనే రైతులు అభివృద్ధినిరోధకులని, విప్లవవ్యాఘాతకులనీ సిద్ధాంతీకరించుటద్వారా రైతువర్గమునకు మార్క్సు అపచారంచేశాడు. ఆకాలమందు ప్రపంచ మార్కెట్లు బహుళ వ్యాప్తిచెందనందున, తన పరిసర వాతావరణమంతా కార్మికమయమైనందున, మార్క్సు యీ అపచారమును చేసియుండవచ్చును. కాని లెనిన్ యిదే తప్పిదము చేయుటకు మొండికెనంతప్ప వేరుకారణంలేదు. లెనిన్ హయాంనాటికి ప్రపంచమార్కెట్ల వలయంలో రైతులు, కార్మికులు గూడ తలదూర్చి, ఆర్థిక సంక్షోభములకు యిరువర్గములున్నూ గురియైనాయి. రైతులపై ప్రపంచమార్కెట్ల ప్రభావమునుగురించి ఆలోచించుటకు అవసర పరిస్థితులు యేర్పడివున్ననూ, 'రైతులు విప్లవవర్గంగాదు' అను మార్క్సుయొక్క మూఢవిశ్వాసమునకు లోనైనందున, లెనిన్ అందులకు గడంగలేదు.

మార్క్సు జీవితకాలంలో ప్రపంచమార్కెట్ల వలయంలోనికి కొద్ది మంది రైతులే యీడ్వబడ్డారు. క్రమంగా గత 80 సంవత్సరాలుగా, రైతులు బహు సంఖ్యాకులుగ ప్రపంచమార్కెట్ల వలయంలోనికి లాగబడుతూ, ఆర్థిక సంక్షోభాలకు వారును గురిచేయబడుతున్నారు.

“సామాన్యంగా రైతులు ఒకేరకం పంటపండిస్తుంటారు. కాని ధనిక వ్యాపార పారిశ్రామిక వర్గములు రైతుల పంటలకు కారు చౌకధరలిస్తూ, తమ పారిశ్రామిక వస్తువులను మాత్రం అత్యధిక ధరలకు రైతులకే విక్రయిస్తుంటాయి. ఇట్లు పతిత, వ్యవసాయ దేశాలు ప్రపంచ మార్కెట్ల దోపిడికి గురిచేయ బడుతున్నవి” (రాల్ఫ్ ఫాక్స్ రచించిన “కమ్యూనిజం” అను పుస్తకం.)

1929–35 ఆర్థికమాంద్యం రైతుల కండ్లు తెరిపించింది. దారుణమైన ప్రపంచ మార్కెట్ల దోపిడి నగ్నస్వరూపంతో ప్రత్యక్షమైంది. అంతకు ముందు కరువు, కాటకాలు, అతివృష్టి, అనావృష్టులకు రైతులు గురియైనారే గాని, యిట్టి ఆర్థికమాంద్యమును రైతులు కనివిని యెరుగరు. ఎంతకాలం పని చేసి, ఎంత పండించినా, దరిద్రమునే వెళ్ళపోసుకొనవలసిన దుస్థితి రైతుల ఆలోచనా శక్తిని రేకెత్తించింది. అమెరికాలో, ఇండియాలో మారొటోరియం (అప్పుల వాయిదా) బిల్లుకు ఆందోళన జరిగింది. సుంకముల రూపేణా రక్షణ కల్గించాలనీ, సివిల్ జైళ్ళు (అప్పులు చెల్లించని ఫలితంగా జైళ్ళు) రద్దుకావాలని ఆందోళన జరిగింది. నూతన ఆర్థిక సంక్షోభ విషయమై నూతనమార్గాన్వేషణకు ప్రపంచ రైతాంగం బయలుదేరిం దీవిధంగా. జాతీయత గూడ యీ మార్గాన్వేషణలో రైతాంగమునకు తోడైంది. జాతీయ దృక్పథంతో ప్రపంచ మార్కెట్ల ప్రభావమును పరిశీలించ గడంగారు.

1929 కి పూర్వం భారత ప్రజలలో జాతీయతత్వముకన్న కులతత్వమే యెక్కువగవుంది. గాంధీజీ రాజకీయరంగ ప్రవేశంతో, ఆయన విప్లవాస్త్ర ప్రయోగంతో జాతీయ చైతన్యం పెంపొంద నారంభించింది. (నెహ్రూ స్వీయచరిత్ర) బ్రిటిష్ సామ్రాజ్యవాదముపై తిరుగుబాటు అను నూతన శక్తి ఏడులక్షల గ్రామాలకు ఆత్మీయమైంది. రైతు వుద్యమంగూడ బయలుదేరింది. గాంధిజీ రైతు వుద్యమానికి వ్యతిరేకమని ఒక్క క్షణమైనా యెంచరాదు. రైతులకు గాంధిజీయె కొండంత ఆశ. రైతుదే భూమి హక్కనీ, రైతే దేశానికి ప్రాణాధారమనీ, రైతు సంఘాలు విజృంభించాలనీ ఆయన అనేకసార్లు ప్రకటించాడు గూడ

తమ్ము పారిశ్రామిక యజమానులు దోపిడిచేయుచున్న వైనమును కార్మికులు గుర్తించినట్లే, రైతులునూ ప్రపంచమార్కెట్లు, పారిశ్రామిక దేశాలు చేయుచున్న దోపిడిని గుర్తించారు. ప్రపంచ ఆర్థికసంపద పంపకంలో తమకు జరుగుచున్న దురన్యాయాన్ని, ఆర్థికసంక్షోభముల మూలముగా దుష్ఫలితములను రైతులు గుర్తించ నారంభించారు.

తమ్ము దోపిడిచేయువారి యెదుర్కొనుటలో, కార్మికులకన్నను రైతులకే సంఘీభావము, సంఘటిత ప్రతీకారచర్యల కవకాశముగలదు. ఎట్లన—

1. గ్రామస్వరాజ్యము, గ్రామీణ స్వయంపోషక విధానములు రైతుల హృదయాలలో రాజ్యంచేస్తూనే వున్నాయి.

2. స్వావలంబనులైన రైతులలో, ఆత్మగౌరవం సమసిపోలేదు.

3. ప్రజలందరి ప్రాణదాతలైన ఆహారవస్తూత్పత్తిదారులే రైతులు. కాన ప్రభుత్వాధిపత్యమునుగూడ పొందగలమనే ఆత్మవిశ్వాసం వారిలో వుంది. ఇట్టి ఆత్మవిశ్వాసంగల్గిన నీగ్రోలు, రెడ్ ఇండియన్లు నేటికిని పరుల ఆధిపత్యమును తిరస్కరిస్తూనేవున్నారు. భారత రైతాంగం తన సాంఘిక సమస్యలను కులపెద్దల ఎదుటను, సంఘపంచాయితీలలోను పరిష్కరించుకొనుట యిట్టి ఆత్మవిశ్వాసమునకు, అభయమునకు నిదర్శనములే.

4. స్వీయనాయకత్వమున, సాశిక్షితులుగా ప్రవర్తించగల సమాజశక్తి రైతులలో వుంది కులములు, మతాలుగా వుంటూ, ఐకమత్యముతో గ్రామీణ, జాతీయ సామరస్యమును పెంపొందించుకొంటున్నారు.

కావున కార్మికులకన్న అధికతర సమైక్యాశ, శక్తిగల్గి, విప్లవదళాగ్రగాములైతీరుతారు రైతులు. రైతులకు కేంద్రీకృత నాయకత్వము ఏర్పడి, రైతాంగ చైతన్యమును మరింత పెంపొందించుట అవసరమే భారతజాతీయోద్యమం యీ విషయంలో స్తుత్యర్హము. రైతాంగమునకు రాజకీయ విప్లవ శిక్షణనొసంగుతున్నది. జాతీయోద్యమ పిలుపులు వీరోచితంగా రైతులు అంగీకరించి, జాతీయ విప్లవములందు, ముఖ్యముగ 1942 జాతీయ సంరక్షణోద్యమంలో, ధైర్యసాహసాలను, విప్లవశక్తిని వెల్లడించారు. కేంద్రీకృత నాయకత్వము, కార్యక్రమము, ముందునన్నావారలు వున్నట్లయితే, విజయ ఢంకా బజాయించేవారు.

ఏనాడైన, బ్రద్దలు కావటానికి సిద్ధముగనున్న అగ్ని పర్వతంలాగా వుంది. రైతాంగం. జాతీయ చైతన్యం ఒక వైపునుంచి బడబానలాన్ని ప్రకోపింప జేస్తున్నది. మరొక వైపునుండి ప్రపంచ మార్కెట్ల దోపిడి, యీ అగ్ని పర్వతాన్ని ప్రజ్వలింప జేస్తున్నది మరొక ఆర్థిక సంక్షోభంతో, యీ రైతాంగ విప్లవాగ్ని పర్వతం, బ్రద్దలై, నిప్పుకణాలను కక్కుతుంది. ఇంతకాలం రైతాంగమునకు ఒక సూత్రకారుడుగాని, ఒకపార్టీగాని లేక పోయింది. కావున రైతులను మేల్కొల్పేవారు, వారి విప్లవ ధర్మమును విడమరచి చెప్పేవారు లేక పోయారు. కావుననే భారత రైతు వుద్యమం 20 సంవత్సరాలక్రితం వుద్భవించింది ద్వితీయ ప్రపంచ సంగ్రామం రైతాంగ విప్లవచైతన్యం పెంపొందుటకు తోడ్పడింది. చైనాలోను 1923 లో రైతు వుద్యమం మొలకెత్తిందిగాని, కమ్యూనిస్టు విషకౌగిలిలో వుండిపోయింది. ఈవింత కౌగిలినుండి యిప్పుడిప్పుడే చైనా రైతాంగం బయట పడుతున్నది.

ఇక బాల్కన్ రైతాంగం ముఖ్యంగా బల్గేరియా, క్రోషియా రైతాంగం స్టాంబోలిస్కీ, రాడిక్ సోదరుల నాయకత్వమున, సువర్ణాక్షరాలతో లిఖింప బడదగిన పోరాటాలు జరిపి, రైతాంగ విప్లవ చైతన్యమును యినుమడింప జేసుకుంటున్నారు.

గాంధీజీ ఆశీస్సులతో, ప్రపంచ రైతాంగమునకు, భారత రైతాంగం మార్గదర్శక మౌతున్నందుకు మనం గర్వించాలి.



# 16

## ప్రధాన సమస్య

మార్క్సు రైతులు విప్లవ నిరోధకులని సిద్ధాంతీకరించాడు. లెనిన్, స్టాలిన్ గారలదే మనస్తత్వము నలవరచుకున్నారు. నవయుగ విప్లవ నాయకుడు గాంధీజీ వొక్కడే రైతుల విప్లవశక్తిని గుర్తించాడు.

మొత్తం ప్రపంచ జనసంఖ్యలో 120 కోట్లమంది వ్యవసాయప్రజలు, 40 కోట్లమంది మాత్రమే వ్యవసాయేతర ప్రజలు. కావున జనసంఖ్యలో నూటికి 76 గురుగవున్న రైతుసమస్యే ప్రపంచంలో ప్రధానసమస్య ఐతీరాలి.

రైతుల ప్రధానసమస్య ఏమిటి?

పారిశ్రామిక దేశాలు, పారిశ్రామిక, వర్తక, వాణిజ్య,ధనిక వర్గములు, సామ్రాజ్యవాదమును, యంత్ర పరిశ్రమలను అడ్డం పెట్టుకొని, వ్యవసాయ ప్రజలను హద్దూ పద్దూ లేకుండా దోపిడి చేస్తున్నారు. ఈ “మూలదోపిడి” మూలమట్టం చేయుటే రైతుల ప్రధాన సమస్య. ఈ సమస్యాపరిష్కారమునకే రైతులు విప్లవమార్గమున వురుకుతున్నారు.

ఐతే, ప్రపంచధనికవాదం కాలోచిత సంస్కరణలద్వారా, రైతాంగ ప్రాతికూల్యమును, రైతాంగ విప్లవతత్వమును సమయింప జేయుటేగాక? కొన్ని దేశాలలో, కొంత కాలంవరకు, సంస్కరణా విధానముతో, ధనికవాదము

సాయుధ పోలీసుదళాలు గాని, శాశ్వతముగ రైతాంగ విప్లవజ్వాలలను ఆర్ప జాలవు. రైతాంగ విప్లవతత్వం అణచరానిది.

ప్రపంచ పారిశ్రామిక విధానం సాగిస్తున్న దోపిడికి రైతులతో పాటు, మధ్యతరగతి ప్రజలు గూడ గురియౌతున్నారు. అమెరికాలో పారిశ్రామిక కార్మిక ప్రజలకు యితర శ్రామిక వర్గ ప్రజలకన్న జీతాలు అనేకరెట్లు అధికము. ఈ రైతు, ప్రజావర్గములు తెలివితేటల యందు గాని, నేర్పరితనమందు గాని, కృషియందు గాని కార్మికవర్గమునకు తీసిపోరు. ఐనప్పటికినీ జాతీయసంపద పంపకంలో, యీ యితర వర్గ ప్రజలును అసమాన భాగస్వాములే! తరతమ భేదంతో, యిదేరీతి, వేర్వేరు దేశముల రైతులు పీడింపబడుచూనే వున్నారు.

ఇట్లు ప్రపంచ సంపద పంపకములో జరుగుచున్న యీ ప్రాతిపదిక దురన్యాయము ప్రపంచవ్యాప్తమైన ప్రధానసమస్య. కాన దీని పరిష్కారమునకు ప్రపంచవ్యాప్త మార్గమవసరం.

ప్రపంచవ్యాప్తమైన యీ దురన్యాయమునకు మందు ఒకటే, అసమాన మారకపు రేటు అంతమించుటే. గత ఆర్థికమాంద్యం కాలమందు వ్యవసాయ దేశముల కడుపుగొట్టి, బ్రిటన్ లాభపడిన విధంచూస్తే, అసమాన మార్కెట్ విధానం యొక్క విలయస్వరూపం స్పష్టమౌతుంది.

అసమాన మారకపు విధానము ప్రపంచధనిక పెట్టుబడిదారీ విధానముల పెంపుడుబిడ్డ, ప్రపంచధనిక వాద, పెట్టుబడిదారీ విధానము లంతమందనంత కాలం అసమాన మారకపు విధానం అంతమందదు.

రెండు ప్రపంచయుద్ధాలు యీ దుష్టశక్తుల నగ్నతాండవమును ప్రదర్శించాయి. పతిత ప్రజల జాతీయోద్యమాలు, గాంధేయపథము, రైతుపుద్యమము, అన్నీ గూడ రైతాంగ ఆర్థిక దుస్థితికి అసమానమారక విధానము దాని ప్రాపు ప్రపంచ ధనిక పెట్టుబడివాదములే మూలమని ప్రబోధిస్తూ, రైతాంగ చైతన్యమును పెంపొందించాయి. చైతన్యవంతులైన వ్యవసాయప్రజలు అణచరాని విప్లవశక్తిగ విజృంభిస్తున్నారు. ఏ రాజకీయ సామ్రాజ్య పెనుభూతము గూడ, రైతాంగ విప్లవము నణచలేదు.

ఇక ప్రపంచ ధనికవాదమునకు చేటుదాపరించిందన్నమాటే. ఒక వైపు నుండి కార్మికులు, మరొక వైపునుండి ప్రపంచరైతాంగం ప్రపంచ ధనికవాదమును ముట్టడించుచున్నాయి.

# 17

## రైతులే విప్లవాగ్రగాములు

"ప్రపంచ ఆర్థిక సంపదలోని అసమానత్వమే (కార్మికుల కొనుగోలు శక్తి క్షీణించుటే యీ అసమానత్వమని కమ్యూనిస్టు సోషలిస్టుల నమ్మకం) ఆర్థిక సంక్షోభములకు మూలకారణమను" తర్కమును, కొంత వరకు మాత్రం, కమ్యూనిస్టు, సోషలిస్టు శాస్త్రీలు గుర్తించారు. చీద కార్మికుల కంటెను నిరుపేదరకమును వెళ్లబోస్తున్న రైతాంగ ప్రజల కొనుగోలు శక్తి క్షీణించుట వల్లనే ఆర్థిక సంక్షోభములు వస్తున్నాయను ప్రప్రథమ, ప్రాతిపదిక, నగ్న సత్యమును వారు గుర్తించలేదు! రైతాంగ ప్రజల కొనుగోలు శక్తి తగ్గుట వల్ల, పారిశ్రామిక సరకుల విడుదల స్తంభించిపోయి, క్రమంగా బ్యాంకులు దివాళాదీసి, ఆర్థిక సంక్షోభం అకంధిమౌతుంది. అంతేగాని వ్యవసాయ ప్రజల దోపిడీ ఫలితాన్ని పంచుకొనుటలో పారిశ్రామిక యజమాన, కార్మికవర్గముల మధ్యగల అసమానత్వమే ఆర్థిక సంక్షోభాలకు ఆదికారణం గాదు. ఆర్థిక సంక్షోభముల నంతమొందించవలెనంటే, ప్రపంచ రైతాంగ ప్రాతిపదిక దోపిడీ విధానాన్ని తుదముట్టించవలెను. ధనిక వాదంపై జరుగు రైతాంగ కృషికి, ప్రత్యక్షు విరోధులగు యజమానులు కల్పిస్తున్నందున పారిశ్రామిక కూలీలుగూడ చేయూత నిస్తారు.

కావున ప్రపంచ సామ్యవాద సంస్థాపనలో ప్రధానపాత్ర రైతాంగముది; ద్వితీయ స్థానమే పారిశ్రామిక కూలీలది.

"రైతులు ఆధునిక శాస్త్ర పరిజ్ఞానము చేకూర్చు నూతన పరికరములను వుపయోగించుటకు వెనుకాడుతారని, అవిధంగా రైతులు మానవ సమాజ అభివృద్ధి నిరోధకులని" మార్క్సిస్టులు నిందించుట సామాన్యమైంది. కాని యీ నింద సత్యేతరము.

"నవయుగ పరిస్థితులు, కోర్కెల కనుగుణ్యంగా ఉత్పత్తిసాధనములుండేంత కాలం, అవి అంతమొందవు. సామాజిక పరిస్థితులు, కోర్కెలనీడేర్ప జాలని ఉత్పత్తిసాధనములే అంతమొందుతాయి" అని కారల్ మార్క్సే స్పష్టంగా చాటాడుగదా. ఇదే దృష్టితో, రైతాంగ ఆర్థికవిధానమును పరిశీలించి చూదాం.

మానవ సమాజంలో ఏర్పడు నూతన పరిస్థితుల కనుగుణ్యంగా, ప్రజల నూతన వినూత్న కోర్కెల నీడేర్పజాలియే వున్నది రైతాంగ ఆర్థికవిధానం.

క్రొత్త క్రొత్త పంటలను, అవసరాలకు తగినట్లుగ రైతులు పండిస్తున్నారు. మామూలు పంటల అభివృద్ధికి క్రొంగ్రొత్త పథకములను, పరికరములను రైతులు ప్రయోగిస్తూవున్నారు. క్రొత్తయెరువులు వేయటంలో గాని, ఆంటీ-యిరోషన్ పద్ధతులకు గాని రైతులు విముఖులుగారు. స్వంతఆస్తులు రైతాంగమున కాత్మీయమైనను, సహకారపద్ధతికి రైతులు సుముఖులే. స్వంత భూములపై ప్రాణంవున్నా, లాభదాయకమగు నూత్నపరివర్తనముల నాహ్వానించుటకు రైతులు వెనుకంజవేయరు

కాన, ప్రపంచమార్కెట్లపై ధ్వజమెత్తిన రైతాంగవిప్లవ తత్వమును శంకించుట శాస్త్రీయసామ్యవాదం కానేకాదు.

పారిశ్రామిక దేశాలను లొంగదీసి, వ్యవసాయపంటలకు అధికధరలు సంపాదించుకొనుటకు (అంటే అసమానమారకపు విధానం ఫలితంగా జరుగు దోపిడిని అంతమందించుటకు, తగ్గించుటకు) రైతులు గ్రామీణ, జాతీయ స్వయంపోషకత్వం పెంపొందించుకుంటూ, పంటలప్రణాళికల నేర్పరచుకొంటూ, ఉత్పత్తి సమ్మెలకు సైతం వెనుకాడరు. ఈ రైతాంగాస్త్రముల శక్తిని దక్షిణామెరికా, బాల్కన్ రాజ్యాలు, ఆసియా దేశాలు యిప్పుడిప్పుడే గుర్తించుతున్నాయి.

ప్రపంచమార్కెట్లదోపిడినుండి రైతాంగమునకు రక్షణగల్గించు పథమునకు తమతమదేశాల ప్రభుత్వాలను మరలించగల శక్తిని ఆదేశాల రైతులు పొందుతున్నారు. రైతులు చైతన్యవంతులై, సంఘబలమును పెంపొందించుకుంటూ, ఆత్మవిశ్వాసంతో, ధైర్యంగా రాజకీయాస్త్రములను యెంతతీవ్రముగ ప్రయోగిస్తే, అంతత్వరితముగ అసమాన మారకవిధానము, దానికి మూలమైన ప్రపంచ పెట్టుబడిదారీవిధానము అంతమందుతుంది.

---

# 18

## నవయుగ విప్లవ వర్గాలు

"చరఖా, చేమగ్గము, కమ్మరి సుత్తె, పోయి, నూలుయంత్రము, నేత యంత్రము, భారీ కర్మాగారాలు రావటంతో, ఒంటరిగా, బృందాలుగా పనిచేయటం పోయి, వందలు, వేలకొలది కార్మికులు ఒకచోట పనిచేయటం వచ్చింది" — ఎంగెల్స్.

మార్క్సుగాని, ఏంగెల్సుగాని, కడకు లెనిన్‌గాని, ధనికవాదయంత్ర పరిశ్రమల పెంపుతోపాటు రైతాంగ పరిణామమును గుర్తించలేక పోయారు. పారిశ్రామిక దేశాలలోని రైతాంగ పరిణామము నైనను సరిగా పొడగాంచ లేకపోయారు. రైతాంగం క్రమంగా భూమిని కోల్పోయి, క్రమంగా కార్మికులుగ మారుతారని వారన్నారు. కాని యూరప్ దేశాలలో గూడ యిది సంభవించలేదు సరిగదా రైతాంగ ఆర్థిక విధానం అక్కడ గూడ నూత్న బలమును శక్తిని పొందుతున్నది జమీందారీలు, జమీందారీ దోపిడి విధానమునుండి రైతాంగం విముక్తినందుతూ నూత్నహక్కులను పొందుతున్నది.

చౌకగా, గొణుక్కోకుండా తమకు ముడిపదార్థాలు సప్లయి అయ్యే మార్గం వెతుక్కుంటూ బయలు దేరిన పారిశ్రామిక ధనికవాదమునకు జమీందారులు నిరోధక శక్తిగ కన్పించారు. కావుననే జమీందారీలను అదముట్టించుటలో పారిశ్రామిక ధనికవాదము రైతాంగానికి తోడైంది. ఆహారపంటల నుండి రైతులదృష్టిని వ్యాపార వాణిజ్యపంటలవైపు ఆకర్షించింది. (వీలైన చోట్ల నిర్బంధపరచిన ఉదంతాలూ లేకపోలేదు; చాంపరాన్ నీలిమందు తోటలు — ఇట్లే కాంగో, దక్షిణమెరికా, కెనడా, మలయా, జావా, గోల్డుకోస్టు) రైతులు గూడ ధనవ్యామోహితులయ్యారు. తమ జీవితావసర వస్తువులను, (కడకు ఆహారపదార్థాలు సైతం) యితర ప్రాంతాలనుండి, యితర దేశాలనుండి, రైళ్లు, స్టీమర్లతో తెచ్చుకోవచ్చునని యోచించి, వ్యాపారపంటలకే యొగబ్రాకారు. బెంగాల్ జనపనారకు, ప్రత్తికి మధ్యరాష్ట్రాలు, బీహారు సంయుక్త రాష్ట్రాలు చెరకు పంటలకు, గుంటూరు పొగాకు ఇట్లే అనేక జిల్లాలు నూనెగింజలకు దృష్టిని మరల్చి, వాటి వుత్పత్తి విషయమై కేంద్రీకరించాయి. వెట్టిచాకిరి, బానిసత్వము, కౌలుదారు పరిస్థితినుండి బయట కొచ్చి, నవయుగ ప్రపంచమార్కెట్ల వలయంలో అడుగుపెట్టారు. ఐతే జమీందారీ విధానమును రద్దుపరచుటకో నీవరకు మాత్రమే ప్రపంచమార్కెట్లు రైతులకు తోడైనాయి. పాతజమీందారీవిధానమును, రద్దుపరచుటకు తోడ్పు

డిన పారిశ్రామిక విధానమే 'పరోక్ష భూస్వామ్యము'ను (తోటలు వగైరా) రైతుల నెత్తిన రుద్దబూనింది. రైతాంగ అధిక్యతను భంగపరచింది. హింసకు గడంగి దక్షిణ అమెరికా రెడ్ యిండియన్ల, ఆఫ్రికన్ రంగుజాతులవారి భూములను బలవంతంగా స్వాధీనపరచుకున్నారు. ఇట్లు పారిశ్రామిక విధానము తన రైతాంగ ప్రాతికూల్యతను ప్రకటించింది.

కాని రైతాంగ ఆర్థికవిధానం యీ ప్రాతికూల్యతనుండి జయప్రదంగా బైటపడుతున్నది. పారిశ్రామిక ధనికవాదసృష్టియైన వాణిజ్య పంటతోటల లోకన్న, స్వతంత్రంగా కష్టించి స్వంతభూములలో యెకరానికి అధికపంట పండించగల్గుతున్నాడు. రైతాంగ ఆర్థికవిధానము అంతమందకపోగా, ఫలవంతమైనదేనని గుర్తెరింగిన పారిశ్రామికవిధానం, రాజీమార్గాన రాక తప్పిందిగాదు.

120 కోట్ల రైతాంగం తన రైతాంగ జీవనమును కోల్పోలేదు. ఎందరో భూములను కోల్పోవచ్చు, పారిశ్రామిక దోపిడి దుష్ఫలితాన. కాని వాటిస్థానే ఆవాక్రమణభూములు, యెస్టేటులు రైతుల చేతుల్లోకి వస్తున్నాయి. అసలు ఒకకనీస పరిమితికి మించని భూములు రైతుకుటుంబాల స్వాధీనం తప్పి యితరుల స్వాధీనంలోకి పోకుండా 'శాసనబద్ధరక్షణాలు' వస్తున్నాయి. భూములు మరీచిన్న కమతాలుగా విభజనగాకుండా, 'చిన్న వ్యవసాయ ఖండముల కలుపువిధానం' వస్తున్నది.

కావున ప్రపంచమార్కెట్లు, పారిశ్రామిక విధానముల ఫలితాన; రైతు వర్గం నశించకపోగా, అభివృద్ధి చెందుతూనే, ప్రపంచమార్కెట్లు, ప్రపంచ ధనిక వాదముల ప్రత్యర్థిగా, ఒక ప్రపంచ మహాశక్తిగా, రైతాంగం నవయుగంలో ఆవిర్భవిస్తూన్నది. కాని రైతాంగ ప్రాపంచిక విప్లవ పాత్రను యెత్తిచాటే మార్క్సుగాని, లెనిన్ గాని, వారికి లేదు. సోషలిస్టు పార్టీలు గూడా జ్ఞానచక్షువులు తెరువలేక పోయినాయి. రెండు ప్రపంచ యుద్ధాలు 1929–35 ఆర్థిక సంక్షోభము రైతుల అభివృద్ధిని, రైతాంగ ఆర్థిక విధానాన్ని భంగపరచు మహాదారుణ శక్తులుగ ప్రత్యక్షమైనాయి. అదే రైతుల విప్లవ ధర్మమును గుర్తింప జేసింది.

మార్కెట్లు, ప్రపంచ వాణిజ్యము పడిపోయి ధరలు విపరీతంగా తగ్గి ఋణబాధలు మితిమించి, పరపతి నశించి, పంటలు అమ్ముడు పోయేమార్గం మృగ్యమై—ఒక్కమాటలో చెప్పాలంటే రైతాంగం దివాలా యెత్తింది.

దీంతో రైతులు ఆలోచనా సముద్రంలో మునిగారు. గృహ అవసరములను, గ్రామీణ స్వయం పోషకత్వమును వర్జించి, విదేశాలపై ఆధారపడటం, అదుపులో వుండని ప్రపంచమార్కెట్ల వలయంలో కాలు పెట్టటం ప్రమాదభరితమని గుర్తించగడంగారు. ఈ రైతాంగ విప్లవ చైతన్యమును మహాత్మాగాంధి పెంపొందిస్తున్నాడు. గ్రామాలవైపు మరలండని గ్రామీణ ఆర్థిక స్వయం పోషక తారక మంత్రము నుపదేశిస్తున్నాడు.

ప్రపంచ ధనికవాదము, పారిశ్రామిక విధానముల పెంపుదలతో పాటుగనే రెండు ప్రపంచ విప్లవ వర్గములు వృద్ధి పొందుతున్నాయి. అవి రైతాంగవర్గము, కార్మిక వర్గములు. విప్లవ రైతాంగ వర్గము పుట్టుక, పెరుగుదలను మార్క్సుగాని, లెనిన్ గాని, స్టాలిన్ గాని గాంచలేక పోయారు. పతిత, వ్యావసాయిక దేశీయులే, రైతాంగ విప్లవశక్తిని, స్వభావాన్ని చాటగల్గారు.

పాశ్చాత్య దేశాలలో వలె ప్రత్యక్షదోపిడీకే గాక, ప్రపంచమార్కెట్ల పుణ్యాన రైతాంగము "పరోక్షదోపిడీ"కి గూడ గురియౌతున్నది.

"ధనికవాదంలోనే పరస్పర వైరుధ్యము, వుండటం, దానిపాత్రల్లోనే సహజవైరివర్గం పెంపొందటం ఫలితంగా, ధనికవాద మంతమందుతుంది" అని మార్క్సు అన్నాడు.

ధనికవాదము అంతరంగిక రాజకీయార్థిక కల్లోలముల ధాటికి తట్టుకో గల్గిందంటే-దినదినము కుప్పతిప్పలుగ పెరుగుతూన్న వ్యవసాయవస్తూత్పత్తి దోపిడీకనువుగా, ప్రపంచ రంగుజాతుల పతితప్రజల దోపిడీ విధానాన్ని నిరాటంకముగా సాగించగల్గుటవల్లనే. ఫాసిస్టు హిట్లరు మొదలు, ఆంగ్లో-అమెరికన్ ధనికవర్గాలవరకు, అన్ని పారిశ్రామిక దేశాలు తమ కార్మికప్రజలకు చేకూరుస్తున్న, చేకూర్చిన అధిక సాంఘిక సౌకర్యాలన్నీగూడ రైతాంగ ప్రజలను దోపిడి చేసిన ఫలితంవల్లనే చేకూర్చగల్గారు.

రైతాంగమే కన్ను తెరచి, ప్రపంచ ధనికవాదముపై ధ్వజమెత్తనారంభించింది. ఇక పారిశ్రామిక ధనికవాదము కార్మికులకునూ సంతృప్తి పరచజాలదు. కావున కార్మికులున్నూ తిరుగుబాటు తత్వప్రేరితులౌతారు. ఈవిధంగా రైతాంగము, కార్మికవర్గములు సమిష్టిగా ప్రపంచ ధనికవాదముపై ద్విముఖదాడి సాగిస్తేనే ధనికవాదం అంతమౌతుంది".

రైతాంగపు అంబులపొదిలో ఉత్పత్తి నిరోధక సమ్మెలు, స్వయం పోషకములే గాక, జాతీయత, సామ్రాజ్యవ్యతిరేకత అను మరిరెండు బాణము లున్నాయి.

ఇట్లు ధనికవాద చితిలోనుండి వుద్భవించే రైతుకూలీవర్గములు విప్లవ విజయాన్ని స్థిరపరచుకొనుటలో, టెక్నీషియన్లు, గుమస్తాలు, మున్నగువారి (అంటే ప్రజావర్గం) సహకారం అవసరం. ఈమధ్య తరగతి ప్రజావర్గం విప్లవ నిరోధకవర్గం గాజాలదు. సమానహోదా, గౌరవ ప్రతిపత్తులను హామీయిస్తే, యీప్రజావర్గం రైతు, కూలీవర్గాలకు బాసటగా వుండగలదు. 1937 వరకు యీ ప్రజావర్గ వ్యతిరేక ధోరణి ననుసరించిన సోవియట్ కార్మిక నియంతృత్వము, తన లోపమును గుర్తించి, 1937 లో వారి లోపమును సవరించుకున్నది రష్యాలో. రైతులకు యింకను రాజ్యాధికారంలో సముచిత ప్రతిపత్తి రష్యాలో యివ్వలేదు. కావుననే ప్రపంచ రైతాంగానికి రష్యా ఆదర్శరాజ్యం గాలేకపోయింది. అన్ని శ్రామికవర్గముల సంయుక్తాధికారాన్ని భద్రతరం చేయు రైతు, కూలీ ప్రజారాజ్యాన్నే ప్రపంచ రైతాంగం ఆశించుతూంది

విస్సన్న చెప్పిందే వేదమంటూ, మార్క్సు యేనాడో, నాటిపరిస్థితుల వాతావరణమునకు లోనై చెప్పిన సూత్రాలనే, నేటికినీ ధర్మసూత్రాలుగా పట్టుకొనివ్రేలాడటం కమ్యూనిస్టులకు ధర్మంగాదు.

మార్క్సిజములో జడత్వంలేదు. కాలానుగుణ్యంగ, మార్పులు చేసుకోటానికి వీలున్న సిద్ధాంతమే మార్క్సిజం కావున రైతు, కూలీ ప్రజా వర్గముల విప్లవశక్తిని గుర్తించిన నవయుగంలో, రైతుకూలీ ప్రజారాజ్యా శయాన్ని బోధించే గాంధేయ పథమునకు అనుగుణ్యంగా, మార్క్సిజమును సమన్వయ పరచుకోవాలి.

# 19

## ఉత్పత్తిసాధనములు - ప్రపంచ సంపద

"ఉత్పత్తి సాధనముల స్వామ్యముపై ఆర్థిక సంపదపంపిణి ఆధారపడి వుంటుంది" —కారల్ మార్క్స్.

ఇది యంత్రోత్పత్తిసాధనములుగల పారిశ్రామిక దేశాలకు అన్వయించును. కాని స్వంత వుత్పత్తిసాధనములు కల్గియు, తమ వుత్పత్తిఫలితముపై అజమాయిషీ యెరుగని రైతాంగ దేశాలవిషయంలో చేతిపనులు ప్రాధాన్యం గలదేశాల విషయమేమి ? ఈప్రశ్నకు మార్క్స్ జోస్యంజెప్పలేదు. వినాశక మార్గమున రైతువర్గము పరిణామ మందుతుందన్నాడు ధనికవాద వుత్పత్తి విధానముముందు రైతాంగ విధానము అంతమౌతుందని వూహించాడేగాని, రైతాంగవుత్పత్తి పద్ధతి అంతమందకపోగా, ధనికవాద వుత్పత్తి విధాన కను గుణ్యముగ పరిణమించింది. రైతాంగ విధానముగాని, చేతి పరిశ్రమలుగాని క్షీణించకుండానే వున్నందున, రైతాంగ, చేతి పరిశ్రమలవారికి పారిశ్రామిక ప్రజలకు మధ్య ప్రపంచ సంపద పంపిణీకి, రైతాంగ చేతిపరిశ్రమల ప్రజలకు కల్గుచున్న అన్యాయమునకు గలకారణములు అన్వేషించవలసివచ్చింది.

రైతులు, చేతిపరిశ్రమదారులకు ధనికవాదపెట్టుబడి (Finance Capital) మీదగాని, ప్రపంచ మార్కెట్లపైనగాని, మారకపు విధానము మీదగాని, వీటన్నిటికి మూలమైన ధనికవాద వ్యవస్థపై గాని అధిపత్యంలేదు. వారువుత్పత్తిజేయు సరుకులమీదనే వారికి అధిపత్యంలేదు.

మార్క్స్ కాలంలో 'వ్యాపార పెట్టుబడి' కన్న 'పారిశ్రామిక పెట్టుబడి' విధానముదే పైచేయిగవుంది కావుననే అయన పారిశ్రామిక యజమానుల విషయము, వారిచేతుల్లో వున్న వుత్పత్తిసాధనముల విషయము నొక్కి వక్కాణించాడు.

లెనిన్ కాలంనాటికి పారిశ్రామిక, వాణిజ్య పెట్టుబడులను మీరింది ధనికవాద పెట్టుబడి దీనిదే పైచెయ్యి అయింది. కావుననే ధనిక పెట్టుబడి సామ్రాజ్యవాదముల విషయమై ప్రత్యేకముగ నొక్కి పల్కాడు.

ఇక యీనాడు పారిశ్రామిక, వాణిజ్య, ధనిక పెట్టుబడి విధానములన్ని, వాటి ప్రాపునైన ఆర్థిక, రాజకీయ సామ్రాజ్యవాదములు కలసి

వాయి. వీటన్నిటి కలయిక ఫలితములను చూడగల్గుచున్న మనం, ఆధునిక సమాజంలో, సంపద పంపకముయొక్క స్వభావమును నిర్ణయించు మూలశక్తి యేమిటో పరిశోధన చేయుటానికి అవకాశాలున్నాయి.

ప్రపంచసంపదపంపకానికి వుత్పత్తి సాధనముల స్వామ్యము ప్రధానమైనది గాదా. ఆధునిక ధనికవాద అస్త్రములైన ధనికపెట్టుబడి, ప్రపంచ సామ్రాజ్యవాదములకే, సంపద పంపకంలో అగ్రతాంబూలం అని నవయుగ అనుభవం చూపిస్తూన్నది



# 20

## వర్గీకరణము

కార్మికవర్గములకు ధనిక, యజమాన వర్గములు శత్రువులైనట్లే, రైతులకున్ను పారిశ్రామిక, వాణిజ్య వర్గములవారు విరోధులు. 'పారిశ్రామిక వర్గం' లో యజమానులే గాక కార్మికులుగూడ యిమిడివున్నారు. తెలిసియో తెలియకనో, ప్రత్యక్షముగనో పరోక్షముగనో, (చాలవరకు పరోక్షముగనే) పారిశ్రామిక విధానదోపిడి ఫలితంలో కార్మికులుగూడ భాగం పంచుకుంటున్నారు. కార్మిక అవసరముల నీడేర్చుట కవసరమయ్యే డబ్బు దోచుకొనుటకు అనువుగా పారిశ్రామిక విధానం అదుపులో రైతువర్గం అనే 'భావి' వుంది. ఈ దోపిడిలో భాగమే కార్మికులకు అధిక సాంఘిక సౌకర్యములను చేకూరుస్తున్నది.

వాణిజ్యవర్గము, ప్రపంచమార్కెట్ల సహకారముతో, కారు చౌకధరలకు ముడిపదార్థములను వ్యవసాయ ప్రజలవద్దకొని, తమ పారిశ్రామిక వస్తువుల నత్యధిక ధరలకు అదే రైతాంగం నెత్తిన రుద్దుతూ ద్విముఖముగ రైతాంగమును ధనికవాదం దోపిడి చేస్తున్నది. ఈ దోపిడి జరుగుచున్నంత కాలం కార్మికవర్గమును సంతృప్తి పరచటం వారికి దుస్సాధ్యంగాదు. ఈ దోపిడి లాభములో నుండియే బ్రిటన్; ఫ్రాన్సు, అమెరికా, కార్మికులకు అధిక సౌకర్యాలు లభిస్తున్నాయి.

ఇప్పుడే రైతాంగమును సంతృప్తి పరచాలంటే, ధనికవాదం కార్మికులనుగాని, ఉద్యోగ వాణిజ్య వర్గాలనుగాని దోపిడి చేయవలసి వుంటుంది. స్వల్పలాభమును అణుమాత్రం గూడా తగ్గించుకొనుటకు ధనికవాదం ఇష్టపడదు, కాని కార్మికవర్గం సుసంఘటితమై, చైతన్యం పొందుతూన్నది సమ్మెలు, తిరుగుబాటుల ప్రమాదంవుంది, కాన కార్మికులను దోపిడిచేసి, రైతులకు పంచి ఇవ్వటం దుస్సాధ్యం. అదీగాక రైతాంగ దోపిడిలో కార్మిక వర్గానికి గూడ భాగం వుండిగదా? ఇక వర్తక, వాణిజ్య వుద్యోగ బృందాలలో ధనికవాద వ్యాప్తికి మూలస్తంభాలేనాయె! కాన రైతాంగమును ధనికవాదం శాశ్వతంగా, సంపూర్ణంగా సంతృప్తి పరచజాలదు. రైతులు అసంఖ్యాకులు. వారి కేపాటి సూక్ష్మ సౌకర్యం కల్పించాలన్నా, యెంతో లాభమును వదులుకోవాల్సివుంటుంది; కాన రైతాంగము, ప్రపంచ ధనికవాదముల మధ్య రాజీ యెరుగని, శాశ్వత ఘర్షణ వుందన్నమాటే. కార్మిక వర్గమునైన తాత్కాలికముగ, కొంతవరకైన తృప్తిపరచ వచ్చునేమోగాని రైతాంగమునుసంతృప్తి పరచటం ప్రపంచ ధనికవాదమునకు చేతగానిపని. కాన ధనికవాద వ్యవస్థకు బద్ధవిరోధు లెవరంటే రైతాంగమును ముందుచెప్పి; ఆ పిమ్మట నే కార్మికులను చెప్పాలి.

రైతులు కార్మికులకన్న అధిక సంఖ్యాకులే గాక, ధనికవాద వ్యతిరేకత గూడ రైతులకే మెండు. ప్రపంచమార్కెట్లద్వారా రైతులు పరోక్ష దోపిడికి గురి యౌతుంటే, కార్మికులు ప్రత్యక్ష దోపిడికి యెరయౌతున్నారు. ఐనా రైతులిప్పుడిప్పుడే చైతన్యవంతులౌతున్నారు. కార్మికుల కున్నట్లు మార్క్సు లాంటి ప్రవక్తగాని, సోవియట్ విజయాలుగాని, సోషలిస్టు కమ్యూనిస్టు పార్టీలుగాని రైతులకు తోడు లేనందున, పైగా మార్క్సునుండి స్టాలిన్ వరకు ప్రపంచమంతటా రైతాంగ వ్యతిరేకతనే పెంపొందిస్తూండినందున, రైతాంగం ఆలస్యంగా చైతన్యమంద నారంభించింది. ప్రపంచంలో సమగ్రమైన సోషలిజం యేర్పడాలంటే, రైతు, కూలీ శ్రామిక వర్గాలు యేకమై ద్విముఖదాడి సాగించాలె. ఒకరి కొకరు సంబంధం లేకుండా, అంటే అందనట్లుంటే విప్లవ విజయం సాధ్యంగాజాలదు.

కార్మిక కర్షక వర్గముల నినాదాలు (1) సంపూర్ణ రాజకీయాధికారం, (2) పరిపూర్ణ ఆర్థిక స్వరాజ్యం (3) శ్రమఫలితంపై సర్వాధికారం (4) దోపిడి విధాన నిర్మూలనములు ప్రధానములైన నినాదాలు. ఈనినాదాలుగల వర్గములను ధనికవాదం శాశ్వతంగా తృప్తిపరచలేదు. మరొక ప్రబల కార

ణం వల్లను, ప్రపంచ ధనికవాద నిర్మూలనం రైతాంగానికి అవసరంగా కన్పించుతోంది. వ్యవసాయ కూలీల కోర్కెలు యీ ధ్యేయాలంటే, ప్రపంచ మార్కెట్ల లాభంలో అధిక భాగం పొందవలసి వుంది, కాని దీనికి ప్రబల ఆటంకం ధనికవాదమే అని తన అన్వేషణలో రైతాంగం తెలుసుకొని, చిచ్చుల పిడుగువలె ధనికవాద నిర్మూలనకు పిడుచుకు వడుతూంది.

రైతాంగం ఒక ప్రత్యేక వర్గమనిగాని, రైతాంగ విప్లవవిశిష్టతను గాని మార్క్సు, లెనిన్, స్టాలిన్, ట్రాట్స్కీ లెవ్వరు గుర్తించలేదు. రైతుల విప్లవపాత్ర చంచలమనియే మార్క్సు అన్నాడు. కాని నవయుగ ధనికవాద దుర్వ్యాపారా పీడనముల ఫలితంగా రైతాంగంలో ప్రజ్వరిల్లు విప్లవశక్తి నాయన గుర్తించ లేక పోయాడు. లెనిన్ గూడ దీన్ని గ్రహించ నోల్లనం దువనే రైతువర్గమును మూడు బృందములుగ, విభజించి, చెండాడు విధాన మును లెనిన్ అనుసరించాడు ట్రాట్స్కీ రైతువర్గమంతటినీ చెండాడవలె నన్నాడు. స్టాలిన్ సోషలిస్టు వ్యవస్థకు రైతులు అతికిపోతారని గుర్తించాడే గాని, కార్మికవర్గ, కమ్యూనిస్టు 'విజయోన్మాదము'ను కుదిరి, రైతాంగాను కూలత ప్రదర్శించ లేక పోయాడు. మార్క్సు కూడ ప్యారిస్ విప్లవ కాల మందు కార్మికులను రైతుల, మధ్య తరగతి ప్రజల సహాకారము నర్థించాడే గాని, రాజ్యాధికారంలో భాగస్వామ్య మొసంగుట కామోదించ నందున, మధ్య తరగతి సహాయ నిరాకరణం చేసింది. రైతులపై అనుమానాలను, అశంకలను పోగొట్టుకొనలేను కాన 1871 ప్యారిస్ విప్లవం విఫలమైంది.

'నిర్బంధ' సమిష్టి వ్యవసాయ విధానానికి రైతాంగం యెదురనియెంచి రైతాంగ ప్రతిఘటనా ప్రకటనకు, అవకాశం లేకుండా, దేశవ్యాప్తి రైతు వుద్యమాన్ని నిషేధించి, రైతాంగాన్ని నాయక రహితులుగ చేశాడు, లెనిన్. దీనిఫలితంగా రైతాంగ భూదగ్ధ విధానము, సహాయనిరాకరణ, అహారక్షామం, ప్రభుత్వం, మిలిటరీతో రైతాంగ ఘర్షణలు వచ్చినాయి. మిలిటరీబలముగల కార్మిక నియంతృత్వానికి బహుళ సంఖ్యాకులైన రైతాంగం తలయొగ్గక తప్పిందిగాదు.

ఇట్టి కల్లోలాలే పునరావృతం కావాలా? రష్యాలో తప్పు జరిగితే ప్రపంచమంతా తప్పుచేయాలా? సవరించుకోరాదా?

"ఇదివరలో చెలరేగిన చారిత్రాత్మక వుద్యమాలన్నీ అల్పసంఖ్యాకుల అధిపత్యానికై, అల్పసంఖ్యాకులు సాగించినవే. కార్మికోద్యమం మాత్రమే

అసంఖ్యాకమైన చైతన్యపూరిత ప్రజాపుద్యమం. కార్మికేతర వర్గాలన్ని (రైతు, మధ్యతరగతి సహా) విప్లవవ్యాప్తానుకు వర్గాలే" (కమ్యూనిస్టు మ్యానిఫెస్టో)

కార్మికవిప్లవమే అశేష ప్రజావిప్లవమని మార్క్సు అన్నాడే గాని, యే దేశంలోనూ కార్మికులు అధిక సంఖ్యాకులు గారు. కార్మికేతర శ్రామిక ప్రజలు కార్మికులుగా మారుతారన్న మార్క్సు జోస్యం ఫలించలేదు. సరిగదా నవ యుగంలో అద్వితీయ విప్లవవర్గంగా రైతాంగమే గాక, మరొక విప్లవ వర్గంగా మధ్యతరగతీ ఆవిర్భవించింది. రైతు, కూలీ, ప్రజావర్గములు కలిస్తే 'అది అశేష ప్రజావర్గముల విప్లవం' గా పరిణమించుతుంది. గాంధీజీ ఒక్కడే యీ నవయుగ విప్లవ వర్గత్రయం వునికిని గుర్తించాడు. విప్లవవర్గత్రయ సమైక్యతను–అంటే అసంఖ్యాక శ్రామిక ప్రజావిప్లవ ఆవశ్యకతను – చాటాడు.

కార్మికులవలెనే, రైతాంగమున్ను ఒక విశిష్టవర్గము, రైతాంగవర్గం అవిభాజ్యం. కార్మికవర్గంలోను, సునిశిత కార్మికులు, మొరటి కార్మికులు, తాత్కాలిక శ్రామికులు, శాశ్వత శ్రామికులు, అధిక వేతన కార్మికులు, అల్ప వేతన కార్మికులు అని తరతమభేదము లున్నట్లే, రైతాంగవర్గంలోను భూమి గలవారు, లేనివారు అనగా గల తరతమ భేదములున్నాయి. అంతమాత్రాన రైతాంగాన్ని ఏకవర్గీయులు కాదనుట అసత్యము. బుఖారిన్ తన 'చారిత్రక భౌతికవాదం'లో వర్గము నీవిధంగా నిర్వచించాడు.

"వుత్పత్తివిధానంలో ఒకేవిధమైన పాత్రను నిర్వహిస్తూ, అన్యులతో ఒకేవిధమైన సంబంధంగలవారందరు యేకవర్గీయులు" మరియు "అందరకు ఒకే విధమైన హక్కులు వుంటూ, అన్యవర్గముల పట్ల ప్రాతికూల్యంలో ఏకముఖులై వుంటారు, ఒక వర్గానికి చెందిన ప్రజలు."

ఈ నిర్వచనం ప్రకారం చూస్తే, రైతాంగం (వ్యవసాయ ప్రజలు) స్పష్టంగా ఒకవర్గమని తేలుతుంది. రైతులలో అనేక బృందాలు, బృందాల మధ్య పరస్పర వైరుధ్యం వున్నాగూడ, రైతాంగం, కార్మికులవలె అవిభాజ్యమైన ఒకవర్గమే.

కాన కార్మికవర్గ సమైక్యత విషయమై మార్క్సు చెప్పినమాటలు రైతాంగవర్గ సమైక్యతకును అన్వయించును. ఈవర్గ సమైక్యత ఆశయాలు రెండు వర్గ శత్రువు అయిన ధనిక వాదమును తుదముట్టించు ప్రయత్నంతో పాటు, పరస్పర ఆంతరంగిక పోటీని తగ్గించుకొనుటే వర్గసమైక్యతా శయాలు,

"ఒక గొలుసులో అనేక గొళ్ళెములు వున్నట్లుగనే, కార్మిక వర్గంలోను అనేక శాఖలు (బృందాలు) వున్నాయి వర్గచైతన్యం విషయంలో, వివిధ శాఖలమధ్య అంతరంవుంచి, ఈ తారతమ్యమే పార్టీ అవశ్యకతకు కారణ మౌతుంది." అని గూడ చారిత్రక భౌతికవాదంలో బుఖారిన్ వ్రాశాడు. ఇదే విధంగా రైతాంగ చైతన్యంలో భేదంవుండటంవల్ల రైతాంగ వర్గ ఐక్యతను సాధించాలసిన అవసరమూవుంది. కార్మికవర్గ ఐక్యసంఘటనను గాని, రైతాంగ వర్గ ఐక్యతను గాని భంగపరచటమే విప్లవనిరోధక జమీందారీ, ధనికవాద వర్గముల ఆశయం. వర్గఐక్యసంఘటన నేర్పరచుటే విప్లవవాదుల విధ్యుక్త ధర్మం. రైతాంగములో తరతమ భేదము యెంతవున్నను "ప్రపంచ ధనికవాదమును, దాని ప్రాపుయైన అసమాన మారక విధానమును" నిర్మూలించుటే రైతులందరి ఆశయం. వర్తక, వాణిజ్య, పారిశ్రామిక వర్గములపైనే రైతాంగానికి ద్వేషం. కావున రైతులందరు ప్రపంచ ధనికవాదమునకు వ్యతిరేకముగ, ప్రపంచ రైతాంగ విప్లవైక్య సంఘటనను నిర్మించుకోగలరు. అన్ని బృందములకును యిది లాభదాయకమేగదా ?

ఏక వర్గీయులైన రైతాంగము, తమ వర్గహక్కుల సాధించుకొనుటకు యితర వర్గముల ననుసరించ వలసిన అగత్యంలేదు. రైతాంగేతర వర్గ బంధా సర్వదా రైతాంగానుకూల మార్గమును హామీయేది? ప్రపంచ ధనికవాదముపై కార్మికవర్గ పోరాటమెంత నిశితమైనదో, అంతకన్నను సునిశితమైనదే రైతాంగ విప్లవం. ప్రపంచ ధనికవాద వ్యతిరేకవిప్లవ పోరాటంలో పాల్గొను సోదర శ్రామికవర్గములతో గూడ రాజ్యాధికారంలో సమాన భాగం పంచుకొనుటకు రైతాంగం సర్వదా సుముఖమే.

జమీందారీ విధానమునకు, పెట్టుబడిదారీ విధానమునకు, అంతకన్నను ప్రపంచ మార్కెట్లకు రైతాంగం గర్భశత్రువు. అసమాన మారక విధానమునకు రైతాంగం ఆగర్భ శత్రువులు. రైతాంగ ప్రజాపీడనమును రైతాంగం సహించదు. కావున రైతాంగం, 'ధనికవాద వ్యతిరేకత'ను యే పరిస్థితులలోనూ విడనాడజాలరు. ఇది గుర్తించక పోవటం విప్లవ వంచనమే యగును; కాని ధనికవాద నిర్మూలనముతో రైతాంగము విప్లవ మార్గమునుండి తిరోగమించు ననియు ధనికవాద వ్యతిరేకోద్యమంలో రైతాంగం ఒకవర్గముగా పాల్గొనదని, వారికి ప్రత్యేక వర్గఆశయాలు లేవనీ" మార్క్సు పొరబడ్డాడు.

రైతాంగం ఒకవర్గమనీ, వారికి ప్రత్యేకవర్గ ఆశయం కలదని తెలుసుకున్నాం. ధనికవాద వ్యతిరేక పోరాటంతో రైతాంగం తిరోగమించదు.

సోషలిస్టు నిర్మాణంలో గూడ రైతాంగం ఒక విశిష్ట వర్గముగ వుంటుంది. ఇతర శ్రామిక వర్గాలతో కీచులాడక, అన్ని శ్రామిక వర్గాలతోను సహకారం నెరపుతూ, సమాన రాజ్యాధికారం పొందుతూ, సోషలిస్టు సమాజంలోను రైతాంగం వృద్ధి చెందుతుంది. "సోషలిస్టు నిర్మాణమునకు రైతులు విముఖులు గారని" స్టాలిన్ కొంతవరకు గుర్తించాడు. ఐతే ఆయన చేసిన తప్పేమంటే, రైతాంగమును విశ్వసించలేదు రైతాంగ వ్యతిరేక కార్మిక దృక్పథముకే లోనై, రైతాంగమునకు సమాన రాజ్యాధికారం చేకూర్చలేదు.

"ఉత్పత్తిసాధనములు, మారకంవిధానం విషయాలలో పాతకాలపు పద్ధతులనే రైతాంగం ఆశించుతుంది." అని రైతాంగమును అభివృద్ధి నిరోధకులుగ మార్క్స్ చిత్రించబూనాడు. కాని వ్యవసాయ నిర్వహణంలో నూత్న శాస్త్రీయ పద్ధతులకు రైతాంగం సర్వదా సుముఖమేననియు, సమిష్టి వ్యవసాయవిధానము, సహకారతత్వములకు రైతాంగం విముఖం గాదనియు, నవయుగ రైతాంగ అనుభవం చాటుతోంది.

"ఆధునిక ఉత్పత్తి మారక విధానములను, పురావ్యవస్థలో యిరికించ జూస్తుంది. రైతాంగం" అనిగూడ మార్క్స్ నిర్హేతుకముగ రైతాంగమును నిందించాడు. కాని నవ్యరైతు వుద్యమం ప్రాచీన వ్యవస్థా చిహ్నములైన జమిందారీ, షాహుకారీ విధానములను పటాపంచలు చేయుటకే పూనుకున్నది. ఇక "మారకవిధానంపై ఉత్పత్తివిధానం తిరుగుబాటు చేస్తుంది." అని ఎంజెల్సు గుర్తించినట్లు, ఆధునిక అసమాన మారకవిధానంపై రైతాంగ ఉత్పత్తిదారులు తిరుగుబాటు చేస్తారే గాని, 'బావిలోని కప్ప' చందంగా, ప్రపంచంతో సంబంధము వదలుకోరు. రైతాంగం. ప్రాచీన బార్టర్ విధానమును మక్కీకి మక్కీగా అనుకరించక, నవయుగ పరిస్థితుల కనుగుణ్యంగా, ప్రపంచమార్కెట్లో అసమాన మారకవిధానముల నిలువుదోపిడి తొలగించుకుంటూ, రైతాంగానుకూలమైన నూత్నబార్టర్ విధానంద్వారా, నూత్న ప్రపంచం మార్కెట్లను నిర్మించుటే రైతాంగాశయం. ఈ ఆశయ సాధనకు, జాతీయ స్వయంపోషకత్వమును, జాతీయ, అంతర్జాతీయ పంటల ప్రణాళికను, వ్యవసాయపంటల కనీసధరలను, ఉత్పత్తి నిరోధక సమ్మెలు రైతాంగమునకు రక్షరేఖలు.

విప్లవ వర్గలక్షణాలను బుఖారిన్ యిట్లు పేర్కొన్నాడు.

"రాజకీయముగా ధనిక వ్యతిరేకవర్గి, ఆర్థికముగ ధనికవాద దోపిడికి గురియౌతూ, బీదల బృందమై, వస్తు విషయోత్పత్తిలో పాల్గొనే వాడై

వుంటూ, వ్యక్తిగత ఆస్తులను కరుచుకొని తూర్పొకుండా, జీవిత పరిస్థితుల వల్ల సమానులుగా, ఒకటిగా ఏర్పడగల ప్రజల బృందము విప్లవ వర్గము కాగలదు.”

బుఖారిన్ నిర్వచన దృష్ట్యా రైతాంగం విప్లవవర్గమని ఆధునిక రైతు చరిత్ర ప్రకటిస్తుంది. ఈ నగ్న సత్యమును గుర్తించక, గ్రుడ్డిగా మార్క్సు చెప్పిన మాటలనే వల్లించటం అభివృద్ధి నిరోధక మొండితనమే యగును.

కార్మికులవలె వస్తూత్పత్తి దశలోనేగాక, మారకపు దశలోనూ రైతాంగము ఒకే వర్గము. ధనికవాద వ్యతిరేక విప్లవవర్గమే మనూ!

“సామాజికాభివృద్ధి పరిణామమునకు. వుత్పత్తి శక్తుల విజృంభణకు రైతాంగము ప్రతిబంధకమ”ని మార్క్సిస్టులు దూరదృష్టిలేమిచే పొరపడి, “రైతాంగమును ఛిన్నా భిన్నం చేయవలె”నను దురభి ప్రాయమునకు లోనయ్యారు.

“సన్నకారు చేతిపరిశ్రమలవారి స్వంత ఆస్తులనుగాని, చిన్న రైతుల ఆస్తులనుగాని, భంగపరచరాద” న్న “కమ్యూనిస్టు మానిఫెస్టో” నిజతత్వమును గ్రహించ నొల్లక పోవటమే యీ అనర్థానికి హేతువు.

చిన్న చిన్న ఖండములుగ భూమివిభజించబడుట, రైతాంగ ఆర్థిక విధానం పెంపునకు ప్రతిబంధకమని రైతాంగం గుర్తించింది. చిన్న భూఖండముల నైక్యపరచుటకు, ఆస్తిసంక్రమణ’ చట్టములలో గొప్ప మార్పులు రావలసి వున్నాయి. సహకార, సాముదాయిక వ్యవసాయ క్షేత్రములను, పెంపొందించాలన్నా ‘భూమి చట్టములలో’ విప్లవాత్మకమైన మార్పులు జరగవలసివున్నాయి. క్రమానుగతముగ, రైతుల అంగీకారముపై, అభీష్టంపై యిట్టి శాసనపుమార్పులు జరుగుట శుభదాయకం, రైతులు నూత్న పద్ధతులకు, లాభసాటి వ్యవహారాలకు యెన్నడు విముఖులుగారు.

అనాదిలో ప్రపంచ మెల్లెడా సమిష్టి భూస్వామ్యము వుండెడిది. భూమి అంతా సమాజమంతటికి చెందియుండెడి దాకాలమందు. ఈ నాటికి గూడ నీగ్రోలు రెడ్ ఇండియనులు సాముదాయ వ్యావసాయ కార్థిక విధానముతప్ప అన్యము నెరుగరు. కొంతకాల మట్లుండిన పిమ్మట క్రమంగా దాని స్థానే ఆఫ్రికా, ఆసియాలలో కుటుంబ భూస్వామ్యం వచ్చింది. ఈమార్పుకు కారణముల మనమీనాడు ఊహించుకోవలసిందే. సామాజిక భూస్వామికము కన్న, కుటుంబ భూస్వామ్యం ఫలప్రదమని యెంచబడుటచేతనే యీమారు

వచ్చిందని నిష్కర్షగ చెప్పుటకు ఆధారములు లేవు. మరొక దశలో కుటుంబ ఆర్థిక విధానంలో కుటుంబములకు ప్రత్యేక భూస్వాధీన హక్కు ఏర్పడ్డది. ఈ నాటికినీ కొన్ని అరణ్యములు, పేదలహక్కు, తోపులు, తోటలు, పచ్చిక బయళ్లు మున్నగునవి సాముదాయకమై వున్నవి. భూమిపన్ను గూడ గ్రామ పంచాయితీకే చెల్లించుచుండెడివి భూమిపన్ను జాయింటు కుటుంబములపై భూమిశిస్తు చెల్లించు బాధ్యత పెట్టబడింది. ఈ జాయింటు కుటుంబం విశాలమైనది. జాయింటు కుటుంబములలో 500 మంది గూడ ఉండటం గద్దు. కుటుంబములో కమ్యూనిస్టు విధానమే ఆచరణలో వుండి ప్రతివాడు తమకు యిష్టమొచ్చిన పనిని, శక్తికొలది చేస్తూ, అవసరమున్నంత వరకు ఫలితము ననుభవించుతారు క్రమంగా వ్యక్తి స్వామ్యతత్వం జాయింటు కుటుంబములలో జొరబడిరియే కాబోలు వరకట్నములు యితరత్రావచ్చు ప్రత్యేక ఆదాయములను స్వంత ఆస్తిగా పరిగణించటం ప్రారంభమైంది. ఇదే క్రమంగా జాయింటు కుటుంబములలోని కమ్యూనిస్టు విధాన మంతరించుటకు దారి తీసింది. ఈ జాయింటు కుటుంబ పద్ధతి అనేక ప్రాచ్యదేశము లందును, ఆఫ్రికాలో కొన్ని భాగములందు, కొన్ని తెగలవారిలోను వున్నది ధన వ్యామోహము, ప్రపంచ మార్కెట్లు, సామ్రాజ్య వాదము ఆవిర్భవముతో గ్రామీణ స్వయంపోషక ఆర్థిక విధానము, గ్రామ పంచాయితీ పాలనముల అంతమారంభమైంది 80 సంవత్సరాల క్రితమే యీ అంత్యదశ ఆరంభమైంది. ఈ ప్రాచీన విధానమేల భగ్నమౌతున్నది?

వ్యష్టికుటుంబాలు, చిన్న కమతాల సేద్యం అత్యంత ఫలప్రదమైన, చురుకైన ఉత్పత్తి శక్తిగా మనగల్గినదీ, ధనికవాద యుగారంభమున పూర్వం నుండియే, గొప్ప మార్పులకు లోనౌతూవచ్చింది కాని ధనికవాద యుగంతో తలయెత్తిన ప్రపంచమార్కెట్ల వ్యాపకంతో, బాహ్యప్రపంచంతో రైతులు తప్పనిసరిగా సంబంధం కలిగియుండవలసివచ్చింది. స్వయంపోషక పంటల విధానము వదలి, వ్యాపార పంటలవైపు, ధనతృష్ణమీదకు రైతాంగం దృష్టి మరలింది. గ్రామీణ ఋణదాతలకు తోడు బ్యాంకులుగూడ వచ్చాయి. ఈ సంపర్కమే రైతులను ప్రపంచ మార్కెట్లను మహోదోపిడీ సుడిగుండంలోకి రైతుల నీడ్చింది. సామ్రాజ్యవాద క్రూరదంష్ట్రలకు రైతులను గురిచేసిన బహుకాల బాధానుభవం వల్ల రైతాంగంలో, విప్లవ చైతన్యం బయలుదేరి వారిని సామ్రాజ్యవాద, ధనికవాద వ్యతిరేకాగ్రగాములుగ చేసింది. సామ్రాజ్య ధనికవాదపు ఆటకట్టించు మార్గాన్వేషణలో, గ్రామీణ, జాతీయ

స్వయంపోషకత్వమూ, సహకారపద్ధతి రైతులకు కన్పించాయి. ఈ రెండు విధానములు రైతాంగ విప్లవ విజృంభణకు ప్రాణపదములైనాయి. కావున రైతాంగము, సహకారపద్ధతికి సుముఖులు కారనుట సమంజసమే కానేరదు. ప్రాచీన గ్రామ ఋణదాతలకును, నవయుగ ఋణదాతలైన బ్యాంకర్లకు యెంత తారతమ్యముగలదో, అట్లే ప్రాచీన రైతాంగమునకు, నవయుగ రైతాంగమునకు దృక్పథంలో విశేష తారతమ్యం గలదు. చాలీచాలని ఫలితము నొసంగు భూములుగల అశేష రైతాంగం, లాభాకర్షణతోనైన, సహకార వ్యవసాయ విధానమునకు సర్వదా సుముఖముగనేవుంటుంది; సహకార విధాన సత్ఫలితములు ప్రత్యక్షముగ లాభదాయకమని ప్రభుత్వం నిరూపించుటే తడవుగ రైతాంగము సహకార విధానమును ఐచ్ఛికముగ అలంగనం చేసుకో గలదు. రైతువర్గంలో ఉపవర్గాలు లేవు.

రైతాంగవర్గంలో భూమిలేని ప్రజలు మూడవవంతు వుంటారు. వీరిలోను కొందరు వ్యవసాయ పంటల వుత్పత్తిలో అత్యధిక ఆసక్తిగల్గిన కౌలుదార్లు, పాలుదార్లుగ వున్నారు. వీరికిని సామాన్య రైతులకును అట్టే ఘర్షణ లేదు.

ఇక భూమిలేక, కూలీలుగనే వుండు వ్యవసాయ కూలీలకుమాత్రం భూమిగల రైతులు ప్రత్యక్షవిరోధులుగ గోచరించుతారు. కాని నిజానికి వ్యవసాయ కూలీలను భూమిగల రైతులు తక్కువకూలీ రూపేణాను, యితర త్రాను కొంతగ దోపిడి చేస్తున్నమాట నంగీకరించగలము. కాని యీ దోపిడి ఫలితాన్ని ప్రపంచ ధనికవాదం పొట్టనే పెడుతున్నారు కావున వ్యవసాయకూలీల దుస్థితి తొలగాలన్నా, వారు రైతులతో కలసి ప్రపంచ ధనికవాదముపై ధ్వజమెత్తుటే ప్రయోజనకరం కాన వ్యవసాయకూలీలు ప్రత్యేక వర్గం గాదు. ఒకేవర్గమునకు చెందిన రెండు బృందాలే రైతులు, కూలీలు.

తక్కువకూలీ. ఎక్కువశ్రమ, భూమిలేని తనము అను దుస్థితినుండి బయటపడుటే వ్యవసాయకూలీల ఆశయం. అధికశ్రమ, తక్కువ వేతనముల స్థితి తొలగాలంటే, ధనికవాదమును, ప్రపంచ మార్కెట్లను లొంగదీసి, వ్యవసాయ సరకులకు మంచి ధరలు రాబట్టుటయే శరణ్యం. అసలే కుటుంబావసరములకు గూడ సరిపోని ఫలసాయమును పొందు రైతులవల్ల మాత్రమే తమ యీ కోర్కెలు తీరవు. తమ కోర్కెల నీడేర్చుటలో రైతులు నిమిత్త మాత్రులేగాని, ప్రధానులు గారు ఐక్యకృషితో అధికధరలు రాబట్టినపుడు వ్యవసాయ కూలీల కోర్కెల నీడేర్చుటకు రైతులు సర్వదా సుముఖులే,

ఈ యుద్ధకాల అనుభవమే యిందులకు నిదర్శనము. కాన కూలీలదుస్థితి తొలగాలంటే రైతు, కూలీల ఐక్యకృషి అవసరం. కూలీల భూమిలేని తనమును పోగొట్టుటలో గూడ రైతులు సహకరించ గలరు. కాల ప్రవాహాన్ని రైతు లెదురీదరు. నిర్ణీత విస్తీర్ణమునకు మించినధనిక రైతుల అధిక భూములను ప్రభుత్వము తీసుకొని కూలీలకు యివ్వాలను కోర్కెకు రైతాంగము సుముఖతను సంతోషంతో చాటుతుంది. ప్రభుత్వ బంజర్లు, జమీందారీ కమతాలు, ఆవాక్రమణ భూములు అన్నీ కూలీలకు, భూమిలేని వ్యవసాయకులకు యివ్వాలను ఆందోళనకు రైతులు చేయూతనిస్తున్నారు. ఇంత చేసిన కొందరు కూలీలకు భూమిలభించక పోవచ్చు. అట్టి వారిని, నిత్యజీవితావసరముల పెంపు కనుగుణ్యముగ, విధిగా పెరుగ వలసిన నిర్మాణాత్మక పరిశ్రమలలో ఆ కూలీలను నియమించవచ్చు.

భూమి నంతటినీ సమాజపరం చేసి, రైతులకు భూమిహక్కు లేకుండా, సమాజ స్వామ్యము నేల నెలకొల్పరాదనవచ్చు. కాని ఆచరణ యోగ్యం గాదది.

అందరి ప్రజలకు పని, కనీసజీవన భృతి, అర్హమగు వసతులు కల్పించవలసిన బాధ్యత సమాజంపై వుంది. ఈనాడు రైతుల భూస్వామ్యము చాలా భాగం యీ హద్దును మించిలేదు. కాన 'భూములను మాక్రిందే వుంచుకుంటాం' అను రైతుల కోర్కె సమంజసమైనది. చదువుకున్న వానికన్న చాకలి మేలన్నట్లు, వ్యవసాయమందు అహర్నిశలు మునిగి తేలే రైతే, చదువుకున్న పనివారికన్న నైతికముగా వుత్తమములు గాబట్టిన్నీ, అభివృద్ధిదాయక వుత్పత్తి విధానానుసరులే గాబట్టిన్నీ రైతుల భూఖామందత్వమును తొలగించపని లేదు.

రైతుల, వ్యవసాయకూలీల ఆశయం ఒకటి. ధనికవాదమును విధ్వంసం చేయుట, పారిశ్రామిక-వ్యవసాయ ప్రజలమధ్య సమానమైన, న్యాయమైన మారకపు విధానమును సాధించుట, సహకారపద్ధతిని అవలంబించుట ఇతర శ్రామికవర్గములతో కలసి రాజ్యాధికారమును హస్తగతము చేసుకొనుట. ఈ యిరువురి ఆశయములు. తమలో తాము కీచులాడుకొనుచు యిరువురికిని శత్రువయిన ధనికవాదమును ఓడించనూలేరు, రాజ్యాధికారమును చేజిక్కించుకోనూ లేరు.

రైతులు యెన్నటికినీ, యెక్కడగూడ కార్మికులుగ మారజాలరు. రష్యాలోగూడ ఇది సంభవించలేదు. రైతులు కార్మికులమధ్య సహజమైన

భిన్నత్వమున్నది. సాంఘిక పరిస్థితులు వేరు. కాలపరిస్థితుల ననుసరించి రైతులు పని చేస్తారు. కాని కార్మికులో నిర్ణీత కాలమందే పనిజేస్తుంటారు. జీవిత విధానమందును, మనస్తత్వము నందును, వ్యవసాయకులకు, పారిశ్రామికులకు మధ్య భేదమున్నది.

రైతాంగమందును టెక్నీషియన్లు, మెకానిక్కులు వున్నారు. కాని వీరు పారిశ్రామిక విధానమునకు సంబంధించినవారు కాజాలరు. భూమిగల రైతుబృందము తుదముట్టించబడజాలదు. వ్యష్టిభూస్వాములుగనే గాని లేక సహకారపద్ధతిన సమిష్టి భూస్వాములుగనే గాని ఎట్లయినను రయితులుగనే వుంటారు. భూమికి ప్రత్యక్ష హక్కుదారులుగనే వుంటారు సోవశిస్టుదశలో ఫ్యాక్టరీలు, గనులపై కార్మికులకు సమిష్టి స్వామ్యము వుండురీతి భూమిపై యీ రైతులకును సమిష్టి స్వామ్యముండగలదు.

భూమిలేని వ్యవసాయ కూలీలకు గూడ రెట్లయిన భూమి సంపాదించవలెనను ఆశవుంది. కాబట్టి భూమిలేని వ్యవసాయ కూలిగూడ భూమి హక్కును భద్రపరచు రైతాంగ, సహకార ఆర్థిక విధానమునే బలపరచును గాని, రైతులందరను కార్మికులుగ మార్చుట నంగీకరించడు.

భూమిలేని వ్యవసాయ కూలీలు, ఒక ప్రత్యేకవర్గముగ, రైతులకు పోటీవర్గముగ పరిణమించుతారా ?

అట్లు జరుగజాలదు. సహకారపద్ధతి వల్లగాని, వ్యష్టిగనే గాని, కాస్తో కూస్తో భూమిహక్కు నధిక సంఖ్యాకులు ఆర్జించగలరు గాన వారికిని, యితర భూమిగల రైతులకును విభేదములు పొడసూపవు ఇద్దరు ఒకే వర్గమౌతారు. మంచి పంటలు పెట్టు విషయంలోను, అధికధర లార్జించు విషయంలోను విరుద్ధాభిప్రాయము లుండవు, మిగిలిన వ్యవసాయ కూలీలు, ప్రజలు, -టు పరిశ్రమల్లో నిమగ్నులయ్యేవారు కార్మికులుగ మారిపోతారు గృహపరిశ్రమలలో 'కొంతకాలం' పనియందు నిమగ్నులయ్యేవారు అటు వ్యవసాయము, ఇటు గృహపరిశ్రమల యందును శ్రద్ధాసక్తులై వుంటారు

వ్యవసాయ వృత్తియందే నిమగ్నులై వుండు భూమిలేని వ్యవసాయ ప్రజలుగూడ వ్యవసాయవర్గములోనే వుండెదరు; గాని అన్యవర్గముల జేరజాలరు. వారికి కనీసజీత, భత్యాలు, అధికతర సౌకర్యములు చేకూరవలెనంటే, రైతుల లాభముపైనే అది ఆధారపడియుండునుగాన, ప్రపంచ మార్కెట్లు, మారకము విధానముపై రైతులు జరుపు పోరాటములో భాగ

స్వామ్యములై, జాతీయ, ప్రపంచ సంపదలలో పునర్విభజనలో రైతుల పక్షము వహించవలసియే యున్నది.

దీనివల్ల రైతులు ఒక ప్రత్యేక వర్గమని తేలుతుంది. తమ పనిపాటలందు, అనేక విప్లవాత్మక పరిణామముల నాచరణలో పెట్టుచు, తమలో వున్న పరస్పర వైషమ్యములను తగ్గించుకొన ప్రయత్నించుచున్నారు.

ఇదంతా కుటుంబ పోషణకు, కనీసజీవితావసర వస్తుసేకరణ కవసరమగు, ఆదాయమును, ఆర్జించు భూములుగల రైతాంగమునకుమాత్రమే అన్వయించును.

పరోక్షభూస్వామ్య పద్ధతికి రైతాంగం ప్రతికూలత ప్రదర్శించుతోన్నది రైతు వుద్యమం పరోక్షభూస్వామ్య పద్ధతిని పరాన్నభోజ్య పద్ధతి నశించాలని ఆందోళన సల్పుతున్నది.

రైతు వర్గమందు, భూమివున్నా, లేకపోయినా. వ్యవసాయ కార్మికులందరు ఒక బృందము మాత్రమే అయ్యేదగు. . భూమిగల రైతుబృందమందు వ్యష్టి భూస్థితిపరులు, మక్తాదారులు, సహకార క్షేత్ర సభ్యులు, సహకార ల్యాండ్ కాలనైజేషన్ క్రింద ఏర్పడు ల్యాండు కాలనీల సభ్యులు చేరుతారు.

భూమిగల, భూమిలేని రైతు బృందములు రెండున్నూ, ప్రపంచ మార్కెట్లు, ప్రపంచ ధనికవాదము, అసమాన మారకపు విధానమూ, ప్రపంచ సంపద పునర్విభజనలో ఏకోన్ముఖులైయుంటే! వారి మధ్యగల పరస్పర వైషమ్యం, ఇరువురికి శ్రేయస్కరమగు శత్రువర్గాధిక్యతను అంత వాదింపటలో శాశ్వత విముఖులుగ చేయజాలదు

రైతాంగము, కార్మిక వర్గములమధ్య ఒక భేదమున్నది వుత్పత్తి సాధనములపై కార్మికులు అధికారమింకనూ పొందవలసియుండ, రైతాంగమో, పెద్ద భూభాగంలో వుత్పత్తి సాధనములపైహక్కు కల్గిన రైతులు, ముందంజ వేయవలసివుంది. అంటే కార్మికులకన్న విప్లవవర్గమున రైతులు ఒక అడుగు ముందే వున్నారన్నమాట. కార్మికులకున్న అసౌకర్యం రైతాంగంలో భూమి వ్యవసాయ కూలీలకు మాత్రమేకలదు. వారికికూడ భూమి సంపాదించాలనే తత్పరతవుంది. గాన వారును రైతాంగవర్గంలోని భూమిగల రైతులతో సహకరించగలరు. కాబట్టి రైతాంగం (వ్యవసాయ ప్రజలు) అవిభాజ్యమైన ఒకే వర్గము.

# 21

## దురభిప్రాయపు దుష్ఫలితాలు

రైతులు విప్లవాగ్రగాములు గాజాలరనీ, అసలు విప్లవ వర్గమే కాలేదని దురభిప్రాయము మొదటినుండి కమ్యూనిస్టుపార్టీకివుంది. ఈ దురభిప్రాయమునకులోనైనందునే, రష్యన్ కమ్యూనిస్టుపార్టీ, రైతుల 242 కోర్కెల ప్రజాళిక విప్లవ స్వభావమును గుర్తించలేదు.

రైతులు విప్లవ ప్రతిఘాతకులను దురభిప్రాయమునకు లోనై లెనిన్, కార్మికవర్గనాయకుడుగ మాత్రమే వ్యవహరించాడు. రైతాంగమును శక్తివిహీనం జేయాలను ద్రోహచింతనముతో, వారికి స్వంత ఆస్తులుగూడ లేకుండ చెయ్యాలనే పట్టుదలను ప్రదర్శించాడు రైతు, కార్మికుల పేరుతో సాధించిన విప్లవవిజయాన్ని ఒక్క కార్మికులకే కట్టిపెట్టారు. మార్క్స్ సూచించిన రీతి, కార్మికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్పారు కార్మికవర్గపక్షపాతియైన సోవియట్ నియంతృత్వము, రైతులకుఅన్యాయాన్నే తలపెట్టింది.

సంఖ్యాబలానుగుణ్యముగ రైతులకు రాజ్యాధికారంలో భాగం పంచి యివ్వలేదు. ఐదుగురు రైతులకు ఒకే ఓటు అయితే ప్రతికార్మికుడు ఒక ఓటరు అయ్యేట్లుగా, రైతుల రాజ్యాధికార భాగమును సంకుచితపరచారు 1937 రాజ్యాంగంలో 'ప్రతివ్యక్తికి ఒక ఓటు' అను సూత్రమును అమలుజరుపనారంభించారు కాని ఆచరణలో అది నిష్ప్రయోజకమైనది. కార్మికపరేతర (కమ్యూనిస్టేతర) రాజకీయ పార్టీలను తలెత్తనీయలేదు. రైతుసంఘాలుగాని, పార్టీలుగాని యేర్పడకుండా నిషేధాలున్నాయి. అదీగాక 1937 నాటికి రెండు విప్లవాలను క్రూరంగా అణచటం, రైతాంగ వర్గచైతన్యం పెంపొందించేపార్టీలు లేకపోవటంవల్ల, కమ్యూనిస్టు రాజకీయ విరోధులెల్లరు తుదముట్టించబడినందున, రైతులలోనేగాక ప్రజలందరిలోను 'లొంగుబాటుతత్వం' జీర్ణించివున్నందున ప్రతివ్యక్తికి ఓటింగు అధికారమిచ్చినా కమ్యూనిస్టుపార్టీ నియంతృత్వానికి ప్రమాదం లేదని తేల్చుకొన్నమీదటనే యీఓటింగు సంస్కరణ తేవటం జరిగింది. అందువల్ల కమ్యూనిస్టేతరులెవ్వరు రాజ్యాధికారంలో భాగస్వాములుగా లేకపోతున్నారు. ఇది

ప్రజాతంత్రమను గోవుముఖము గల్గిన కార్మిక నియంతృత్వమను వ్యాఘ్ర స్వరూపము. అంతేగాని నిజమైన ప్రజాతంత్రమని మోసపోజాలం.

కార్మిక నియంతృత్వము యొక్క నిజస్వరూపం మరొక్క విషయం లోను తెలుస్తుంది. సంఖ్యాబలానుగుణ్యంగా గాక, శాసన సభలలో రైతుల ప్రాతినిధ్యమును మూడవ వంతుకు పరిమిత పరచారు. ఇదంతా రైతాంగ వ్యతిరేకతత్వము యొక్క దుష్ఫలితమే.

'రైతాంగ వ్యతిరేకతలో సాటిలేనిమేటి' యనదగు ట్రాట్స్కీ సలహా ననుసరించి, విప్లవవిజయాన్ని కార్మికవర్గ నియంతృత్వముగా మార్చిన నాటినుండియు సోవియట్ ప్రభుత్వం రైతాంగ వ్యతిరేకత ననేకరీతుల ప్రకటించింది.

రైతాంగ జీవితావసర వస్తువులను తగినంతగా సప్లయిచేయకన్నే, రైతుల పంటలలో మాత్రం అధికభాగమును, చౌకధరలకు, నిర్బంధంగా గుంజుకోవటం జరిగింది. ప్రారంభదశలోనే యీ వైఖరికి రైతులు అసమ్మతి తెల్పారు. తమ్మకష్టాలు పాల్చేయగడంగిన కార్మిక నియంతృత్వముపై తిరుగుబాటే జరిపారు. కమ్యూనిస్టుపార్టీలోగాని, సోవియట్ ప్రభుత్వాధికారంలోగాని, రైతులకు సరియైన ప్రాతినిధ్యంవుండి, రైతాంగ కోర్కెలను సుహృద్భావంతో పరికించే వారున్నటయితే, 1920_22 సంక్షోభం రష్యాలో వారింపబడేడిది; లేదా కనీసం సంక్షోభం తీవ్రతచాలావరకు తగ్గెడిది.

రైతులపై యింతటి కాఠిన్యము వారిపైగల దురభిప్రాయము ఫలితము ననే; రైతులు విప్లవోద్యమంలో పాల్గొనలేదా? విప్లవవర్గాలతో సహకరించలేదా? భూస్వాములపై దాడిసాగించి జమీందారీభూముల నాక్రమించుకున్నారు. విప్లవప్రతీఘాతుకోద్యమాన్ని తుదముట్టించి, విప్లవాధికారాన్ని రక్షించారు. ఈ విప్లవబాధ్యతల నిర్వహణంలో సోదరవిప్లవవర్గాలతో సంపూర్ణంగా సహకరించారు. ఇంతజేసిన రైతాంగ విప్లవశక్తిని అనుమానించి, రైతాంగ వ్యతిరేక చర్యలను గడంగింది. కార్మిక నియంతృత్వం.

కార్మిక నియంతృత్వంపై రైతులు జరిపినతిరుగుబాటేల విఫలమైంది?

రైతులకు జాతీయనాయకత్వం వహించినదుపు రాజకీయ పార్టీ లేదు. దేశవ్యాప్త రైతువుద్యమం లేదు. కమ్యూనిస్టేతర పార్టీలన్నీ నిషేధించబడ్డాయి. మిలిటరీబలం కార్మికవర్గ నియంతృత్వం అధుపులోవుంది. ప్రపంచ యుద్ధము, విప్లవము, విప్లవప్రతీఘాతుకోద్యమాన్ని అణచిన విప్లవపోరాటం,

వీటితో బహుసంఖ్యాకులు సొమ్మసిల్లి, విసువుతో వున్నారు. వీటికి తోడు కరువుకాటకాలు, ఆకలిబాధల, మృత్యు తాండవం అన్నీ గూడ రైతుల సహజ ధార్మిక తత్వమును రగుల్కొల్పి, రైతాంగ వంచనకు కారణమైనాయి.

ఐతే 1920–22 తిరుగుబాటుతో లెనిన్ గుణపాఠం నేర్చుకోవక పోలేదు. ట్రాట్‌స్కీ ప్రేరిత రైతాంగ వంచనా విధానమున కుద్వాసం చెప్పి, నూతన ఆర్థిక ప్రణాళిక నేర్పరిచాడు. విప్లవ విజయం పొంద జాలక, నిరాశాపరులుగవున్న రైతాంగమునకు ఆదేమహాప్రసాదం అనిపించిం దాడు.

లెనిన్ అనంతరం, మరొకతూరి స్టాలిన్ హయాంలో 'రైతాంగ నిర్బంధాలు' ఆరంభమైనాయి. సహకారం వ్యవసాయ పద్ధతిని నిర్బంధంగా అమలు జరుపబూనారు రైతులను బృందములుగా విభజించి రైతాంగ ఐక్యతకు చేటుదెచ్చారు. కార్మిక నియంతృత్వాధిపత్యాన్ని ధిక్కరించు తారని, ప్రశ్నించుతారని శంకించబడిన నోరుగల రైతునెల్లా 'కులాక్' అనిపేరుపెట్టి ఉరికంబానికి పంపటమో, సైబీరియా ప్రవాసమునకు పంప టమో చేశారు. 'కులాక్' లని ప్రకటించి వారి ఆస్తులను గుంజుకున్నారు. కావాలని రైతుల పన్నుభారము పెంచారు. ఇవన్నీగూడ రైతులలో మరొకతూరి తిరుగుబాటు తత్వమును రగుల్కొల్పాయి. విధ్వంసక చర్య లను, పంటలు, పశువులను దగ్ధం చేయుటకు పూనుకున్నారు; అవిధంగా, బస్తీలను (కార్మికాధిపత్యాన్ని) మార్చి, పంగదీయబూనారు. దేశవ్యాప్తి విప్లవం లేపుటకు కూడబలుక్కొన నారంభించారు.

ఈ ప్రమాదము నాఘ్రాణించి, కార్మిక అధిపత్యం వెనుకంజ వేయక తప్పింది గాదు. విజయోన్మాదంతో జరిగిన రైతాంగ వంచనా చర్యలకు స్టాలిన్ క్షమార్పణ చెప్పుకోన వలసివచ్చింది. రైతాంగ అంగీకారముపై సమిష్టి వ్యవసాయవిధానం అమలు జరుపబడునని స్టాలిన్ హామీనిచ్చాడు.

ఒక వర్గనియంతృత్వము ఇతర శ్రామిక వర్గముల ఆశయాలను, అభి మతాలను గుర్తించదని, లక్ష్యపెట్టదని యీ సోవియట్ అనుభవమే నిరూపిం చింది. రైతువర్గానికి ఒక రాజకీయపార్టీ, నాయకత్వము, సంఘటనవుండి నట్లయితే, స్టాలిన్ నియంతృత్వము కూలిపోవటం గూడ జరిగేది!

ఇట్లు శ్రామిక వర్గాలు కీచులాడుకోవటం అభిలషణీయం గాదు. శ్రామిక వర్గాలన్నీ సంయుక్తంగా, సమానంగా రాజ్యాంగ నిర్వహణంలో పాల్గొని

పరస్పర సుహృద్భావంతో మెలంగుచో రష్యాలోవలె ప్రమాదాలు రావు. కార్మికపార్టీ అనబడు కమ్యూనిస్టుపార్టీకి కార్మికేతర శ్రామిక వర్గములపై ముఖ్యముగ రైతాంగ వర్గముపైనగల ఆగ్రహం, దురభిప్రాయాలే యీ రష్యా ప్రమాదాలకు మూలం. వారి దురభిప్రాయపు దుష్ఫలితమే యేకవర్గ నియంతృత్వము.



# 22

## రష్యా రైతుల దుస్థితి

రైతు, కూలీలకు సమాన ప్రతిపత్తిపై, సోషలిజం స్థాపింపుతామని ప్రకటించిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, 1917 విప్లవ విజయం స్థిరపడగనే, రైతులను త్రోసిరాజని, కార్మికవర్గ నియంతృత్వమునే నెలకొల్పారు. ఈ రైతాంగవంచనా విధానమే రష్యాలో నేటికిని అమలులో వుంది. 1937 రాజ్యాంగం గూడ రైతాంగమునకు సమాన ప్రతిపత్తిని చేకూర్చలేదు.

1942 జనవరి 26 తేదీన సోవియట్ కాంగ్రెస్‌లో మాట్లాడుతూ మార్షల్ స్టాలిన్ అన్నమాటలే దీనికి సూచన. నాడు స్టాలిన్ అన్నమాటలు : "లెనిన్ మనలను విడనాడిపోతూ, కార్మిక నియంతృత్వమును సంరక్షించుకుంటూ, బలపరచుకొనవలసిన భారమును మన భుజములపై వేశాడు."

విప్లవవిజయ సాధనకు సంరక్షణకు కార్మికులతో పాటు, అనన్యత్యాగములు చేసిన రష్యన్ రైతాంగమే, 'విప్లవవిజయ భద్రత' అను మిషతో కార్మికవర్గ నియంతృత్వం చేతిలో యాతిబాధలకు లోను గావలసివచ్చింది. స్వంతభూములు; ఆస్తుల పోగొట్టుకొనుటే గాక, పంచప్రాణాలను బిగబట్టుకొని బ్రతకవలసివచ్చింది. రాజ్యాధికారంలో సమాన భాగస్వాములుగ గాక, కార్మికవర్గమునకు లోకువయై, దాసత్వంతో గూడిన మిత్రులు వగిది మనవలసి వచ్చింది!

ఇదంతా ఏకవర్గ నియంతృత్వాధికార ఫలితమే ?



# 23

## విప్లవ వాతావరణం

మందగమనానంతరం, సామాజిక జీవన సరళిలో చేపద్ధతిన గాక ఒక్కుమ్మడిగ, పెద్దయెత్తున మార్పు వస్తుంది. అభివృద్ధికరమైన మార్పును సూచించు యీవిప్లవం శాంతియుతముగ నడువగలదా? లేక హింసాయుతమైనదిగనే యుండునా?

విప్లవ వర్గాలు కృత నిశ్చయులై, విప్లవ వ్యతిరేక బృందాలు అశక్తులైవుంటే, అహింసాత్మకముగనే విప్లవవిజయము సాధ్యమగునని 1688 ఆంగ్ల విప్లవం సూచిస్తోంది. విప్లవ ప్రతిరోధక బృందాలు ధైర్యసాహసోపేతులై, విప్లవ బృందములను అడించగలమను నమ్మకంతో విప్లవ నిరోధమునకు గడంగినప్పుడు విప్లవ వర్గాలు హింసా ప్రయోగమునకు తలపడుట తప్పని సరిగా వచ్చు. కాన విప్లవములో కొంత హింస యిమిడి వుండవచ్చు. గాంధీజీదీన్ని గమనించియే, హింసా ప్రయోగముతో నిమిత్తం లేకుండగనే, విప్లవమును కొనసాగించవలెనను తలంపుతో పైతరగతుల (విప్లవ నిరోధకుల) వారి మనస్తత్వమును మార్చుటకు యీనాటి నుండియు కృషి చేస్తున్నారు. వారి శ్రామిక యజమానులు, జమీందారులు, ధనిక వాదులు రైతుల్లను ఆయా వృత్తి సాధనములపై ధర్మకర్తలేననీ, అవి సమాజం సొత్తేనని ప్రచారపరచుట ద్వారా ధనికవాదుల మనస్తత్వంలో మార్పుతీసుకురా ప్రయత్నిస్తున్నారు. ఇదే సమయంలో సత్యాగ్రహాలు, ప్రజాసంఘటనల ద్వారా, విప్లవ వర్గాలకు విప్లవ పోరాటములందు శిక్షనొసంగుతున్నారు

ఆత్మరక్షణ తదితర కొన్ని ప్రత్యేక పరిస్థితులలో గాంధీజీ హింసా ప్రయోగమును గుర్తించక పోలేదు. పిరికిపందలుగ వుండటం కన్న హింసాచరణకు గడంగుటైన మంచిదేనని గూడ ఆయన అన్నారు. కాన విప్లవ వర్గాల అహింసాస్త్ర ప్రయోగముపై ధనికవాదం గూడ జరుగవచ్చు, అంతేగాని మొదటి నుండి "హింస" మీదనే ధ్యానంలగ్నం కావాలని అహింసాస్త్ర ప్రయోగంతో పనిలేదనీ మార్క్సిస్టుల మతం మంచిది గాదు.

ఇది వారి మొండిమతం అనవలసియున్నది. అహింసా ప్రయోగం ప్రమాదరహితమేగదా! గత 25 సంవత్సరాల అనుభవంవల్ల అహింసాత్మక పోరా

టం ప్రయోజనకారియని భారతదేశం నిరూపించింది జర్మనీ, ఫ్రాంసు, అమెరికా కార్మికుల హింసాప్రయోగం సఫలితాలను గాక, దుష్ఫలితములనే ఒసంగినట్లు రుజువైంది. కాన అహింసా ప్రయోగమును విసర్జించాలనటం మాత్రం గ్రుడ్డితనం అనక తప్పదు.

ప్రజలలో విప్లవ జ్వాల యెపుడు బయలుదేరును?

కేవలం ఆకలిజ్వాల ప్రజ్వరిల్లినంత మాత్రాన, విప్లవజ్వాల ప్రజ్వరిల్లదని 1943 బెంగాల్ క్షామం వల్ల తేలింది. విపరీతముగ పీడింపబడినంత మాత్రాన గూడ విప్లవజ్వాల బయలుదేరదని హరిజనుల అనుభవం తెల్పుతోంది. తాము పీడింపబడుచున్నట్లు చైతన్యం పొందినంత మాత్రాన గూడ విప్లవజ్వాల బయలు దేరదనుటకు యూరప్ దేశాల కార్మికులే నిదర్శనం. మతతత్వ ప్రేరితులైనంత మాత్రాన గాని, జాతీయ సాంఘిక విప్లవ ప్రేరితులైనంత మాత్రాన గాని, ప్రజానీకం విప్లవ కార్యాచరణకు గడంగలేదు తమకు జరుగుచున్న దురన్యాయమును గుర్తించు సునిశిత చైతన్యం గల్గి, వర్గ చైతన్య పూరితులై, సుసంఘటిత విప్లవ రాజకీయపక్షము, బలీయమైన వర్గసంఘాలు కలిగియుండటమే గాక, జాతీయోద్దీపితులై, జాతీయ నాయకత్వముచే ఆకర్షింపబడి యుండుటయు, వీటన్నింటికి తోడు ఆర్థిక సంక్షోభం, కరువు కాటకాలు, నిరుద్యోగము, యుద్ధము వంటి బాధలున్నను అనేక పరిస్థితులు ఒనగూడినపుడు విప్లవ జ్వాల రగుల్కొంటుంది.

కాబట్టి యెవ్వరును విప్లవానికి స్థల, కాలనిర్ణయాలు చేయలేరు. విప్లవ చైతన్యమును పెంపొందించుకుంటూ, పురోగమించుటే విప్లవ వాదుల విధ్యుక్తం. వర్గ హక్కులకన్నను అతీతమైనవే జాతీయహక్కులు కాన విప్లవ వాదులు జాతీయవాదముయొక్క పొందును సాధించు మార్గమున నడువవలెను.

మార్క్సిస్టులకును, రైతుకూలీ ప్రజారాజ్య వాదులకును గల ప్రధాన సిద్ధాంత విభేదములు.

(1) మార్క్సిస్టులు కార్మికవర్గ మొక్కటే విప్లవవర్గమంటారు. కాని మనం కార్మిక, కర్షక, ఉద్యోగ (ప్రజా) వర్గములను విప్లవ వర్గములుగ గుర్తించుతాం.

(2) వారు రైతులు విప్లవవ్యాఘాతకులంటారు మనం రైతులే విప్లవ దళాగ్రగాములంటాం.

(3) వారు కార్మిక నియంతృత్వము సాధించుతారు. మనం రైతు కూలీ ప్రజారాజ్యము సాధించుతాం.

(4) ధనికవర్గములు కార్మికవర్గమును దోపిడి చేయుట ప్రపంచవ్యాపితమంటారు. ఇది మనం కాదనముగాని దీనికి మించిన ప్రపంచ వ్యాప్త దోపిడి మరొకటి వున్నదంటాం అది రైతాంగమును పారిశ్రామిక వర్గాలు దోపిడీచేయుట.

(5) పోగొట్టుకోటానికి స్వంతం అంటూ యేమీలేని నిరుపేదవర్గమే కార్మిక వర్గం అంటారువారు. కార్మికులేగాక కర్షకులను యీ తరగతికి చెందిన వారేనని మనమన్నాం

(6) రైతులకు స్వంత భూములున్నాయి గాన రైతులు ధనికవాదముతో ఏకీభవిస్తారంటారు. కాని యిది సత్యదూరం. కుటుంబావసరములకు సైతం చాలీ చాలని భూమిగల్గిన అశేష రైతాంగం యొక్క స్వంత ఆస్తిహక్కులను దోపిడి చేయు సాధనము గాదని మనమంటాం. కాన రైతులను ధనికవాదులను ఒకేగాట కట్టటం తగదని హెచ్చరించుతాం.

(7) అధిక వేతనముల రూపేణా కార్మికులకు లంచాలిచ్చి వారిని ధనికవాదం లోగట్టుకోలేదని వారంటారు. దీని యథార్థమును శంకించుటకు నిదర్శనములున్నాయని మన విశ్వాసం. ఏమైనా అరికొ (అధిక ధరల పేర లంచాలిచ్చి) రైతులను మాత్రం ప్రపంచ ధనికవాదం లోగట్టుకోజాలదని; రైతాంగ, ధనికవాద వర్గములకు అగర్భశతృత్వ మున్నదని మా నమ్మకం.

(8) జాతీయత సంకుచితమైనదని, విప్లవప్రతీఘాతుకమనీ వారంటారు. కాని జాతీయత, ముఖ్యముగ పతిత ప్రజల జాతీయత, అఖండమైన విప్లవశక్తియని, జాతీయోత్తేజితులైన పతిత దేశరైతాంగం అద్వితీయ విప్లవవర్గమని మన విశ్వాసం

---

# 24

## మధ్యతరగతి ప్రజల విప్లవ పాత్ర

మధ్యతరగతి ప్రజల విప్లవ పాత్రను మార్క్సిస్టులు పూర్తిగ శంకించారు. కొన్ని చారిత్రక కారణములవల్ల వారిని బూర్జువాలక్రింద మార్క్సు జమకట్టాడు కాని రాజకీయములందు వారు నిర్వహించు అభివృద్ధిదాయక పాత్రను పూహించలేకపోయాడు. "మార్క్సు నిజముగ భావించినదేమి ?"

అను పుస్తకంలో జి డి హెచ్ కోల్ "20 వ శతాబ్దంలో, మధ్యతరగతి ప్రజలు బలుసుబడిగల రాజకీయ బృందంగ పరిణమించుతారని" పేర్కొన్నాడు. కాని మార్క్సిస్టులు మధ్యతరగతి ప్రజలపైగల దురభిప్రాయములను పోనాడలేరు. రష్యాలో యీ దురభిప్రాయముకే లోనైన మార్క్సిస్టులు, మధ్యతరగతి ప్రజలను బాధించారు, హింసించారు వారికి ఓటింగ్ హక్కుకి లేకుండా చేశారు. కావునే వారు కమ్యూనిస్టుల హింసాకాండపై తిరుగు బాటు చేశారు దేశం వదలిపోయారు దేశవ్యవహారముల నిర్వహణంలో సహాయ నిరాకరణం చేశారు. తన్మూలమున అందరికీ నష్టము సంభవించింది. ముఖ్యంగా సోవియట్ పరిశ్రమలు, వ్యాపారవాణిజ్యములు, బుద్ధిబలులు, టెక్నిషియనులు లేని కొరతను బాగుగ అనుభవించింది. విదేశాలనుండి అధిక వేతనాలొసంగి, అనేక టెక్నిషియనులను పిలిపించుకోవలసి వచ్చింది.

మధ్యతరగతి ప్రజల ప్రయోజనమును లెనిన్ గూడ గుర్తించినట్లేయని దీనివల్ల యోంచదగును. స్టాలిన్ స్వదేశప్రజలకు సాంకేతిక శిక్షణ నొసంగ ప్రారంభించాడు. 1935 నాటికి దేశీయ టెక్నిషియనులు తర్ఫియతైనారు. కాని వారు గూడ అధికవేతనముల నభిలషించారు. కార్మికవర్గము కేగాక, తమ్ముగూడ ప్రత్యేకవర్గముగ పరిగణించాలని కోరారు వారి కోర్కెలామోదింపబడినాయి. టెక్నిషియనులు, ఉద్యోగగణమును మధ్యతరగతి కాముకవర్గముగ పరిగణిస్తున్నారీనాడు రష్యాలో. ఓటింగ్ హక్కు, పార్లమెంటుకు ప్రతినిధులను పంపుకొనేహక్కు వారికొసంగబడినవి ఈ గుర్తింపే 1920 లో జరిగి యున్నట్లయితే, యెంతటి విషాదస్థితి తప్పియుండెడిది? జర్మనీలో మధ్యతరగతి విజయం రష్యా అనుభవమును జర్మనీ ఒక హెచ్చరికగా గుర్తించింది. 1917—18 జర్మనీ విప్లవమునుండి గుణపాఠం నేర్చుకున్నారు కాబట్టే జర్మనీలో మధ్యతరగతి ఒక రాజకీయ శక్తిగా ప్రతిబింబమందింది. వారునూ రాజకీయాధికారం కావాలన్నారు, నియంతృత్వమునకే సుముఖత్వం చూపారు; విప్లవము ద్వారానే వారును రాజ్యాధికారం సంక్రమింప జేసుకున్నారు. సిద్ధాంతముల ప్రభావమును వారూ గుర్తించారు జాతీయతను, సామ్యవాదముతో సమ్మిళితం చేశారు. వీటికితోడు జర్మన్ మిలిటరీతత్వమును, నియంతృత్వమును జేర్చి, హిట్లర్ నాజీ నియంతృత్వము నేర్పరచాడు.

జర్మనీలో లెనిన్ యొక్క "నెప్" విధానంవలె సోషలిజమునకు ప్రథమ సోపానముగ, ధనికవాదమును అదుపులోనికి తెచ్చారు. వారి మిత్రవర్గం రైతులు కార్మికులు. ఉద్యోగులలో ఒకభాగం తటస్థులు. భయవిభ్రాంతుల

చేసే టెరరిజం, యజమానులు కూలీలను గూడ చెప్పు చేతుల్లో వుంచుట అనునవి వారి పద్ధతులు. యూదులహింస, రష్యా బొల్షివిక్ వైరం, సర్వాహం భావము, కమ్యూనిస్టు వ్యతిరేకత యుద్ధనీతి...ఇవి వారి ప్రీతిపాత్రములు. ఇంత దౌష్ట్యముతో కూడియున్నను, మధ్యతరగతి ప్రజల విప్లవశక్తిని, జర్మన్ నేషనల్ సోషలిజం లోకానికి చాటింది. కాని మానవప్రపంచమునకు పీడాకరమగు విప్లవ వ్యాఘాతుక దుర్మార్గమున నడచింది వారి వ్యవహారం.

ఇంగ్లండులో — 1926 దేశవ్యాప్తసమ్మె మధ్యతరగతి ప్రజల ప్రాతికూల్యమువల్లనే విఫలమైంది. రెండవ ప్రపంచ సంగ్రామకాలమందు బ్రిటిష్ మధ్యతరగతి ప్రజలు జాతీయపిలుపును చెవియొగ్గి అశేషత్యాగాలు చేశారు. వ్యాపారుల అధికలాభములను అరికట్టునట్లు ప్రభుత్వాన్ని బలవంతపరచి, పాక్షికముగా సోషలిస్టు ధోరణిగల అనేక శాసనములు చేయించి, కార్మిక వర్గమునకు చేయూత నిచ్చారు.

చైనాలో ప్రప్రథమమున జాతీయోద్యమ నాయకత్వము వహించినది మధ్యతరగతి ప్రజలే. జాతీయ సైన్యంలో ప్రప్రథములుగ రిక్రూటై, జపాన్ దురాక్రమణ నెదుర్కొన్నారు నేటికిని చైనా విప్లవ నాయకులు మధ్యతరగతి ప్రజలే.

భారతదేశంలోను మధ్యతరగతి ప్రజలే 1920 వరకు జాతీయోద్యమానికి నాయకత్వం వహించారు. ప్రజలు జాతీయ భావోద్దీపితులు కానందువల్లనే గాక, జాతీయభావములను ప్రస్ఫుటముగ ప్రకటించు శక్తి సంపన్నులైనందునే, వారికి నాయకత్వము లభించింది.

1920, 1930, 1932, 1940, 1942 జాతీయ పోరాటాలలో పాల్గొని, అనేకులుగా విప్లవాగ్ని గుండములో కలసి పోయారు 1939 వరకు గూడ విప్లవాగ్రగాములే అని నిరూపించారు. 1939—44 మధ్య కాలమందు మాత్రం కార్మికులతో పాటు, మధ్యతరగతి ప్రజలు గూడ విప్లవాగ్రగాములుగా లేకపోయారు. ఎందువల్ల? ట్రేడ్ యూనియన్ ఉద్యమ తప్పుడు పంథావల్లను, కమ్యూనిస్టు, రాయిస్టుపార్టీల దుర్బోధలవల్లను కార్మికవర్గము పెడమార్గం త్రొక్కింది. మధ్యతరగతి ప్రజలో — అంతకుముందే అధికారము నెరపిన కాంగ్రెస్ పార్టీ, వారిభవితవ్యమందు సంపూర్ణ విశ్వాసం కల్గించలేకపోయింది తగు పద్ధతులపై జాతీయ కాంగ్రెస్ వారికి అవసర శిక్షణ నొసంగలేకపోయింది (ఆర్గనైజేషన్, ఫండ్సు, వలంటీరు దళము, సిద్ధాంతబలము, కార్యక్రమము నొసంగలేదు.)

కాని మధ్య తరగతి, కార్మికవర్గాలు విప్లవ రైతాంగముతో సహకరించి యున్నట్లయితే వారు సాధింపజాలని దేమియుండెడిది?

మధ్య తరగతి ప్రజలకు కావలసినదల్లా అధిక జీతభత్యములు, వ్యక్తి ఆదాయసముపార్జన, దాన్ని వెచ్చించుటలో స్వేచ్ఛ, ఇంతేగాక, సమాన గౌరవ ప్రతిపత్తులు, రాజ్యాంగాధికారములో సమానభాగము కూడ కోరుతారు వారు

ఈనాడు ధనిక వాదము వారికీ సౌకర్యములన్నిటినీ కల్పించుటకు సిద్ధంగా వున్నానంటున్నది కాని అదంతా దాక్షిణ్య భావంతో ఒసంగు సౌకర్యాలే గాని, వారి శక్తికి లొంగి యివ్వటం కాదు ఈ సౌకర్యాలైనా ప్రీతి పూర్వకముగ కల్పింపబడు చున్నవా? లేదు అడ్డచాకిరి చేయించుకొనియో, మరీ యీ హక్కుల నొసంగుతున్నది ధనికవాదం. కాబట్టే ధనికవాదముపట్ల మధ్యతరగతి ప్రజలు అసంతృప్తులై వుంటంలో ఆశ్చర్యంలేదు

ఇండియా చైనాదేశాల మధ్యతరగతి ప్రజలు జాతీయ భావోద్దీపితులు మాత్రమేగాక, విప్లవ ప్రేరితులై, సోషలిస్టు స్వభావులుగూడ కాగలరు. ప్రజాసామాన్యంలో పాతుకుపోయి, సౌష్టవకర సామాజిక నిర్మాణంలో ముఖ్యభాగస్థులు కాగలరు తెగలుగ విభజింపబడిన సమాజములలో బుద్ధిబలులు, ఆలోచనాపరులు వారే! నాయకత్వలక్షణములు, నాయకత్వమును సంపాదించు శక్తి వారికి వుంది వారిని తృణీకరించజాలం ప్రమాదము నెదుర్కొనుటకు సిద్ధమై మాత్రమే వారిని దూరంచేసుకోవలెను

సాంఘిక విప్లవమువల్ల వారికి చెందు లాభము యేమైన వున్నదా? వున్నది. గౌరవము, గుర్తింపు, రాజకీయాధికారంలో గౌరవపూరితమైన భాగస్వామ్యము లభించుట లాభదాయకము గాదా యేమనుదురు? సాంఘిక విప్లవంలో పాల్గొన్నచో, వారు పోగొట్టుకునేదేమీ యుండదు. కాని గౌరవ భాగస్వాములుగా, ఈ చివరిరీతి, రాజకీయార్థిక జీవనమందు పాల్గొనాలనేవారి యాప్సితం దీనికి వారు అర్హులనిగూడ రష్యా అనుభవం తెల్పుతుంది. బహుకాలం వారి నుపేక్షించుచో, ఓర్పుతోనూ, రాజ్యాధికారమును గుంజుకోగలరని జర్మనీ అనుభవం తెల్పుతుంది. వారిని తృణీకరించుచో, విప్లవములను వారెన్నో విధ్వంస మొనర్చగలరని రష్యా, ఇంగ్లండ్ అనుభవములు తెల్పుతాయి.

గాంధీజీ మధ్యతరగతి ప్రజల కోర్కెలను, వారి విప్లవపాత్రను గుర్తించాడు వారి విప్లవ భాగస్వామ్యముకు ఆహ్వానించాడు. వారి ఆచారములు,

# 25

## కార్మికు లెవ్వరు

"ఉత్పత్తి విధానంలో ఒకే రకమైన పాత్ర నిర్వహించుచు, వుత్పత్తి విధానమందు, యితర ప్రజలతో ఒకేరకమైన సంబంధము కలిగియున్న ప్రజల సముదాయం ఒక వర్గము అవుతుంది" (చారిత్రక భౌతికవాదంలో బుఖారిన్. 276 పుట.)

"వుత్పత్తి సాధనములు స్వాధీనమందు లేక వుత్పత్తి వస్తు సముదాయముపై ఎట్టి అధికారము లేని వారే కార్మికులు" అని మార్క్సు నిర్వచించాడు దీని ప్రకారం "వుత్పత్తి సాధనములపై హక్కు కలిగియుండా, ధనికవాద దోపిడీ విధానమునకు గురియౌతున్న చేనేత కార్మికులు, ఇతర చేతి పారిశ్రామికులు కార్మికులు గారు" అన్నమాట!

మార్క్సు నిర్వచనం ప్రకారం భారతదేశంలో కార్మికులు 50 లక్షలు కూడా లేరు. చేనేత కార్మికులతో కోటిమంది వున్నారు నూనె గానుగ ఆడు వారే 20 లక్షలమంది వున్నారు.

చేతి పరిశ్రమలవారు కూడా కార్మిక వర్గముగ ఆదినుండి పరిగణింప బడ్డారు. కాబట్టి వుత్పత్తి సాధనములు కల్గియుండియు, గృహ పరిశ్రమలందు నిమగ్నులైన వారందరిని కార్మికులుగా సంగ్రహించ వలసియున్నది.

పనివారల ఆర్థికస్థితిని, వర్గస్వభావమును ప్రాచ్యదేశాలలో వుత్పత్తి సాధనముల స్వామ్యము గాక, మారకపు విధానము, డబ్బు పెట్టుబడి మార్కెట్లు నిర్ణయించుతాయి. వర్గస్వరూపమును నిర్ణయించే మార్కెట్లు, మారకవిధానము, డబ్బు పెట్టుబడుల పక్షమున జేయువారు పై వర్గములుగను, వాటికి ప్రతికూలశక్తులుగ వుండువారు క్రింది తరగతులు అనబడు పీడితవర్గములుగను పరిగణింపబడెదరు

చేతి పరిశ్రమలవారు, విప్లవ స్వభావులని, జాతీయ తత్వ ప్రేరితులనీ, ధనికవాద వ్యతిరేకులనీ, భారత చేనేత కార్మిక వుద్యమం నిరూపించింది. సహకారపద్ధతిన ఋణములు, కోఆపరేటివ్ మార్కెటింగ్ పద్ధతి, మంచి చేతి యంత్రముల వినియోగము, శాస్త్రీయమైన ఆర్థికపు విధానము, డిజైను పద్ధతులద్వారా చేనేత వుద్యమం, శాస్త్రీయమైన, అభివృద్ధిదాయకమైన లాభసాటి పరిశ్రమ అని నిరూపమైంది. కాబట్టి యంత్ర పరిశ్రమలలో నిమగ్నులై వుండు కార్మికులవలె గృహపరిశ్రమలయందు నిమగ్నులైన చేతిపరిశ్రమలవారు కార్మికులే యనియు, వారు అభివృద్ధిమార్గపురోగాములే యని తెలుతుంది.

# 26

## దేశ విభజనా ప్రమాదము

దేశవిభజన వాంఛించు పాకిస్థాన్ నినాదమును 1937 లో డాక్టర్ లతీఫు గారు, ఖాక్సరులు లేవదీయగా జిన్నాగారే దాని నసహ్యించుకున్నాడు. కాని అదే జిన్నాగారు 1940 లో పాకిస్థాన్ నినాదమును లేవదీయుటతో, పాకిస్థాన్ నినాదమునకు రాజకీయ ప్రాముఖ్యత వచ్చింది.

భారత స్వాతంత్ర్యపథమున కవరోధక శక్తిగను, కాంగ్రెసు పట్ల వైముఖ్యతను పెంపొందించు శక్తిగను, స్వాతంత్ర్యప్రయత్నాలను భగ్నపరచు సామ్రాజ్యవాదులకు చేయూతగను పాకిస్థాన్ నినాదము రాజకీయ ప్రాముఖ్యత వహించింది.

మధ్యయుగపు మత తత్వపూరితమై, వైరుధ్య భావోద్దీపితమైన యీ పాకిస్థాన్ నినాదంలో స్నేహాత్మ్యం శూన్యము. మహమ్మదీయప్రజానీకంలో మాత్రం చైతన్యం పెంపొందించవలసిందిపోయి, పాకిస్థాన్ నినాదంతో మతమౌఢ్యమును పెంపొందించుచున్నది ముస్లింలీగు. నేడు ముస్లింలీగు సంగ్రామనినాదమే అయింది యీ పాకిస్థాన్ నినాదం.

ముస్లింలీగు కోరిన రీతి పాకిస్థాన్ యేర్పడుచో యేమి సంభవించును?

పాకిస్థాన్ యేర్పడినను, రాజ్యాంగేతర విషయములన్నింటి యందును సమైక్యత సిద్ధించునని జిన్నా, రాజాజీలంటున్నారు. కాని యిది సాధ్యమా? పాకిస్థాన్ రాజ్యమునకు ప్రత్యేక సైన్యములు, సుంకముల విధానము, ఆర్థిక ప్రణాళికలు, కార్యక్రమములు, ప్రత్యేక విదేశాంగ నీతి కావాలని జిన్నా వాంఛించుటలేదా? పాకిస్థాన్ ఆర్థికస్వేచ్ఛ వాంఛించదా? 'హిందూస్థాన్' నుండి దిగుమతి చేసుకొను వస్తువులపై దిగుమతి సుంకములు విధింప నూహించదా?

ఇదంతా సంభవము గాదని యెవరనగలరు? ప్రత్యేక రక్షణసైన్యాలు, సుంకముల విధానము, ఆర్థిక కార్యక్రమాలు, విదేశాంగనీతి వుండుచో, హిందూస్థాన్, పాకిస్థాన్‌లకు పరస్పర వైరుధ్యం ప్రబలు అవకాశం లేకపోలేదు. రెండు రాజ్యములమధ్య యుద్ధప్రమాదం తొలగదు. రెండు రాజ్యము

వాదం నవయౌవ్వనంతో పొంగిపోతున్నది. పరమతస్థుల రక్తం త్రాగాలనే మతమౌఢ్యం వదలలేని సంఘంగా ప్రబలుతున్నది. పాకిస్తానే ఏర్పడితే, మత తత్వపూరిత రాజకీయ నాయకత్వం చేతుల్లో జాతీయ నిర్మాణ కార్యక్రమములు కుంటుపడి తీరతాయి

ఆసియా అంతర్యుద్ధములకు జాతీయ పాకిస్థాన్ ఏర్పాటుతో భారతదేశం వాస్తవ స్వాతంత్ర్యాన్ని కోల్పోవును, తన విదేశాంగ విధాన నిర్మాణములో పరదేశ పెత్తనం, ఆధిపత్యాలకు తలయొగ్గవలసిన దుస్థితి ఏర్పడుతుంది.

కాన పాకిస్తాన్ నినాదం భారత ప్రజాసామాన్యానికి శుభసూచక మనవలసియున్నది.

1942 ఆగష్టు తీర్మానంలోను, పిమ్మటను కాంగ్రెసు సూచించిన మార్గమే, భారత రాజ్యాంగరచనకు సరియైన విధానము కాని దీన్ని జిన్నా అంగీకరించగలడా? బ్రిటిష్ సామ్రాజ్యవాదపు ఆయుధబలముపై భక్తి విశ్వాసములున్నంతకాలం జిన్నా స్వతంత్రబుద్ధితో కాంగ్రెసు సూచనలను పరికించడు

## కమ్యూనిస్టుల వైఖరి

పాకిస్థాన్ నినాదమును కమ్యూనిస్టులు బలపరచుటలో గల ఆంతర్యమేమి? సూత్రప్రాయముగ దేశవిభజన నంగీకరింపజేయుటతో, క్రమంగా, కాలం కలిసివచ్చినపుడు [illegible] ప్రత్యేక స్వరాజ్యములను రెడ్ రాష్ట్రాలలో ఏర్పరచుకోవచ్చు. ప్రత్యేక రెడ్ రాజ్యాల నొకటిగా ఏర్పరచుకొన్న మీదట, రష్యా విస్తరణకు ప్రత్యక్షముగ తోడై, కత్తితో కమ్యూనిస్టు ప్రాబల్యం వ్యాపింపజేయవచ్చునని వారి ఆశ. (దీనికి చైనా ఉత్తరరాష్ట్రముల పోకడే నిదర్శనం)

కాని భారతదేశం విభజనవిషయమై స్టాలిన్ పదిసంవత్సరాలక్రితం విముఖత చూపాడు "భారతదేశం అవిభాజ్యమైన ఐక్యరాజ్యం" అన్నాడు.

కాన భాషా, వైజ్ఞానిక సూత్రములపై రాష్ట్రముల పునర్నిర్మాణమును వాంఛించుట తగును గాని, కమ్యూనిస్టు ముస్లిం లీగులవలె మతము ప్రాతిపదికగ ప్రత్యేక రాజ్యముల నేర్పరచాలని ఆశించరాదు.

బ్రిటిషు సామ్రాజ్యవాదినుండి, భారతజాతీయతను సంరక్షించుకొను ప్రయత్నంలో కాంగ్రెసు ముందంజవేస్తున్నకొద్ది, కాంగ్రెసు ప్రాబల్యమును క్రుంగదీయాలని వాంఛించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదమునకు చేదోడుగ, కాంగ్రెసు పైగల ద్రోహంతో, కమ్యూనిస్టు లీగ్ పార్టీలు, రెండును అభివృద్ధి నిరోధక శక్తులుగ పరిణమించుచున్నవి.

## “కమ్యూనిస్టు కుట్ర”

వ్యవసాయిక దేశమైన భారతదేశంలో, రష్యాయందైన కార్మిక విప్లవం రూపొందునాటి కార్మిక రాష్ట్రములంటూ ప్రత్యేకముగ పేరందిన రాష్ట్రములు లేనపుడు స్వయం నిర్ణయం పేర ప్రత్యేక వ్యక్తిత్వమును కమ్యూనిస్టు లెట్లు కోరగలరు?

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ సామ్రాజ్యము అంతా ఒకే “యూనిట్” అంటారు. అందు పారిశ్రామిక దేశాలు ఒక భాగము, వ్యవసాయిక దేశము లింకో భాగము అని అంటారు. రెండు భాగములును ఆర్థికాది వ్యవహారములందు అన్యోన్యంగా వుంటూ, ఒకే యూనిట్ అనిపించుకుంటాయి అని తమ వాదనను సమర్థించుకోజూస్తారు. కాని వారి మాతృదేశం (సామ్రాజ్య దేశం) భాగ్యభోగ్యాలతో తులతూగు పారిశ్రామిక దేశమనుట నగ్నసత్యం.

అట్లే కమ్యూనిస్టులు గూడ ప్రపంచమంత ఒకే యూనిట్ అంటారు. పితృదేశం (రష్యా) ప్రాబల్యమును అన్ని దేశాలు గుర్తించాలంటారు. సోవియట్ కార్మికులు, వారి యెర్రసైన్యము, విప్లవాగ్రగాములని, వాటిననుసరించి వుండే కమ్యూనిస్టుపార్టీకే విప్లవము గుత్తయని భావిస్తారు.

కాబట్టి స్థానికంగా బలీయమైన కార్మికవర్గం లేకున్నా, సోవియట్ కార్మికవర్గం అండతో, వ్యవసాయ దేశములందుగూడ కార్మిక నియంతృత్వమును నెలకొల్పాలని వారి ఆశ. కమ్యూనిస్టుపార్టీకి బలంవున్నా లేకపోయినా భగవానేకు. ప్రపంచ జైత్రయాత్ర సాగించి, కమ్యూనిస్టుపార్టీలను సోవియట్ రెడ్ ఆర్మీ గద్దె యెక్కిస్తుందనే వారి ఆశ. ఈ ఆశ ఉండబట్టే 1940 లో పూనాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘసభలో “సోవియట్ రెడ్ ఆర్మీ ఇండియామీదకు దాడి వెడలివస్తే మీరు స్వాగతమొసంగరా?” అని ఒక కమ్యూనిస్టు సందేహి, జవహర్‌లాల్ నెహ్రూను అడుగ సాహసించాడు.

"పతిత దేశాలలో ఒక క్రమపద్ధతిపై ప్రచారం సాగించండి" అని లెనిన్ బోధించాడు. అప్పుడు "బలీయమైన సోవియట్ ప్రభుత్వం సాయపడుతుంది. క్రైశాంగ సోవియట్లను నిర్మించి, సైనిక సాధన యంత్రోపకరణాలతో పూర్వ పరిస్థితుల కనుగుణ్యముగ సాంఘిక వ్యవస్థను నిర్మించే అవకాశం ఏర్పడుతుంది" అని ప్రకటించాడు. దీనికే "పారిశ్రామికముగ వెనుకబడిపోయిన దేశాల కార్మికవర్గ సహాయముతో, వెనుకబడియున్న దేశాలలో సోవియట్ పద్ధతిని అభివృద్ధిపరచవచ్చు"నని దీనినే స్టాలిన్ సూత్రీకరించాడు.

ఆర్థికముగ బలహీనమై, రాజకీయముగ అభివృద్ధి చెందక, మతమౌఢ్యముతో నిండియుండు పాకిస్థాన్ నిర్మాణం తమ ఆశయ సాధన కపూర్వ అవకాశముగ ఉండగలదని ముందుగనే గమనించి, గోప్యముగ ప్రోత్సహించటం కమ్యూనిస్టులకు పుట్టుకతో అబ్బినవిద్య. సోవియట్ సేనలు కొంతదూరంలో వున్నవనగా, అంతఃకలహాలు, అల్లకల్లోలము రగుల్కొల్పి, రెడ్ ఆర్మీ విజయయాత్రకు రాచబాట యేర్పరచవచ్చునను ఆశతోనే మాత్రమే పాకిస్థాన్ నినాదంపట్ల నేడు కమ్యూనిస్టులు తమ సానుభూతిని ప్రకటిస్తున్నారు.

రెడ్ ఆర్మీ విజయయాత్రానంతరం, తమ యాజమాన్యమున, అఖండ భారత్‌ను స్థాపించి, భారతదేశంపై, కార్మికవర్గంపేర ఏకచ్ఛత్రాధిపత్యం నెరపాలనే వారి ఆశ. కావున "విభజన శాశ్వతము గాజాలదని, కార్మిక వర్గ ఆధిపత్యమున, కార్మిక సంస్కృతిగల వివిధజాతులు ఏకమౌతాయని" అన్న స్టాలిన్ మాటను వారు విడనాడలేదు.

కాబట్టి యిప్పుడువారు ముస్లింలీగును బలపరచటమల్లా యెందుకంటే దేశ అనైక్యతా, బలహీనతల పెంపొందించి, రెడ్ ఆర్మీ దండయాత్రకు అనుకూలముగ పరిస్థితులు సృష్టించుటకే. ఇక రెడ్ ఆర్మీపట్ల సుహృద్భావమును పెంపొందించుట గూడ వారికర్తవ్యముగదా? కావున యీనాటినుండియే రెడ్ ఆర్మీ సంకీర్తనము చేయటం, రెడ్ ఆర్మీ విజయోత్సవాలు జరపటం ద్వారా రెడ్ ఆర్మీపట్ల మూఢభక్తిని కల్గించ చూస్తున్నారు. ఇక రెడ్ ఆర్మీ సహాయంతో, కార్మికవర్గమంటూ లేకపోయినా, ప్రపంచ కార్మికవర్గప్రతినిధిగా, భారతదేశంపై కమ్యూనిస్టుపార్టీ యొక్క ఏకచ్ఛత్రాధిపత్యం నెలకొల్పుటకు యిదే మార్గమని వారు యెంచారు. దీనికి తామనుసరించిన మార్గం దేశద్రోహకరమైతే మాత్రం వారికేమి లెక్క? లబ్ధం గమ్యస్తే చాలుననే వారి తత్వం!

సత్వర సంపూర్ణ స్వాతంత్ర్య సాధనద్వారా సోషలిస్టు పథమున సాంఘికార్థిక పునర్నిర్మాణ కార్యక్రమములు నిర్వహించాలన్నా, ప్రపంచ శాంతి, అభ్యుదయములకు చేదోడై వుండవలెనన్నా, ప్రపంచంలో భారత దేశం సముచిత స్థానం పొందవలెనన్నా, భారత దేశ విభజన అవాంఛనీయము.

ఐనను గాంధిజీ సునిశితమైన రాజకీయ చతురుడు. కావుననే 1944 లో రాజాజీ సూచనల ప్రాతిపదికపై జిన్నాతో రాజీమాటలు జరిపాడు. "సోదరులముగ విభాగాలు జరుపుకుందాం" అన్న గాంధిజీ మాట అత్యంత భావగర్భితము. జిన్నా హృదయమందు సుహృద్భావము శూన్యము. సోదర భావము అసలే పూజ్యము. హిందూ-ముస్లిం-సోదరత్వం సున్నా అను ధోరణిలో పాకిస్థాన్ పంతము చెల్లితీరాలని పట్టుబట్టుతున్నాడు.

గాంధీజీ అభ్యుదయ రాజకీయజ్ఞుడు. నవ్యభావములను ఆకళించుకొని ప్రపంచ రాజకీయ గమనమున కనుగుణ్యముగ నడుస్తుంటాడు. కావుననే ప్రపంచ సమాఖ్య, ప్రపంచ సైన్యముల నిర్మాణముల ఆవశ్యకతను గుర్తించి, చాటాడు.

పాకిస్థాన్ గాని, హిందూస్థాన్ గానీ, మరే రాజ్యము గాని, సర్వతంత్ర స్వతంత్రమై, యితర దేశాలతో, ప్రపంచంతో సంబంధం లేకుండా మనజాలవనీ, సోదరత్వముతో శోభిల్లుచు సహకార పద్ధతిన, అనేక ఫెడరేషన్లు ఏర్పడదగుననీ, యీ ఫెడరేషన్లన్నీ ఒకే ప్రపంచ లేక ఫెడరేషన్‌లో యూనిట్లుగా వుండదగుననీ, గుర్తించాడు గాంధీజీ. కాని జిన్నా నవయుగావసరాలను గమనించడు. ప్రాచీన మనస్తత్వముతో, పాత కాలము నాటి స్వతంత్ర రాజ్యముగ పాకిస్థాన్ ఏర్పడితీరాలను మొండితనము గల్గి, ప్రాచీనత్వమునకు మూర్తీభవించిన ప్రతినిధి యనిపించుకుంటున్నాడు.

పాకిస్థాన్ నిర్మాణం విషయమై నిర్ణయించగల అధికారం ఆప్రాంతీయ ప్రజలందరికి వుండాలని అంటూ గాంధిజీ ప్రజాస్వామిక ధోరణిని ప్రకటించాడు. కాని జిన్నా గారు అప్రజాస్వామిక ధోరణి నేచాటాడు. ముస్లిం ప్రజలకు మాత్రమే నిర్ణయం చేయగల అధికార ముండాలంటాడు జిన్నా. ఈయన తలదన్నారు కమ్యూనిస్టులు! అసలు ఏ ప్రజల నిర్ణయముతోను నిమిత్తం లేకుండానే పాకిస్థాన్ అనబడు స్వయం నిర్ణయం అంగీకరించబడాలంటారు కమ్యూనిస్టులు! ప్రజాభీష్టములతో నిమిత్తం లేదనుట ప్రజాస్వత్వమును నిరసించు ఆపార్టీకే తగును.

కాని న్యూస్ క్రానికల్ పత్రిక విలేఖరితో జిన్నా గారన్నమాటలు చూచినచో "భారత దేశమును విభజించినచో, దేశరక్షణ, వాణిజ్యము, విదేశాంగ వ్యవహారములను [illegible] వ్యవస్థాపత్యం గల్గియుండవచ్చు" నని అన్నాడు. సర్వదా బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యమును స్థిరపరచుటే జిన్నా తత్వమని తెలుస్తున్నది. జిన్నా గారి దేశభక్తి రహితవిధానమునే పాలించాలంటుంది కమ్యూనిస్టుపార్టీ.

పాకిస్థాన్ ఏర్పడినను హిందూస్థాన్-పాకిస్థాన్ లమధ్య సుహృద్భావము వుండగలదనీ, రెండు రాజ్యాలమధ్య యుద్ధకారణముండదని, రెండు రాజ్యాలు ఏక ప్రపంచసైన్యం గల అఖండప్రపంచ సమాఖ్యలో భాగస్వాములై వుంటాయని అంగీకరిస్తే, అట్టి హామీ ప్రపంచసమాఖ్యనుండి వస్తే, పాకిస్థాన్ నిర్మాణమునకు గాంధీజీ గాని, కాంగ్రెసు గాని విముఖము గాబోదు.

కాని యీ స్నేహతత్పరత, సోదరత్వములే జిన్నాలో మృగ్యము. అఖండప్రపంచ సఖ్యత, ఏకప్రపంచ సైన్యముల నిర్మాణం కనుచూపుమేరలో లేవు.

ఏకప్రపంచ సమాఖ్యలో భాగస్వాములై, అన్నివిషయములందును సమాన ప్రజాతంత్రాధికారము గల్గి, సాధ్యమైనంతవరకు ఏకగ్రీవముగ వ్యవహారం నడుపుకుంటూ భారతదేశంలో కాన్ఫెడరేషన్ ఏర్పరచుకొనుట ప్రమాద భరితము గాబోదు. పరస్పర విభేదాలను అంతర్జాతీయ న్యాయస్థానముద్వారా పరిష్కరించుకొనదగును. అంతేగాని సుహృద్భావము లేని ఫెడరేషన్ల కాన్ఫెడరేషన్ కప్పలేని యిల్లువంటిది, కాగలదు.

## తుదిమాట

ఈ తేజకరమైన సిద్ధాంతములతో, ప్రపంచ దళిత జాతులకు నాయకమణియై, అభ్యుదయపథమున పురోగమించుచున్న భారతదేశం మహోన్నత విప్లవ వీచికలమధ్య వూగిసలాడు తున్నది. కావుననే "విప్లవ ఝంఝామారుతంలో వున్నది భారతదేశం" అని జాన్ గంథర్ సతి చక్కగ వర్ణించింది.

భారత జాతీయ విప్లవాశయాము లెన్ని?

1. జర్మనీ, రష్యాలవలె, జాతీయత, సామ్యవాదములను సమన్వయ పరచుట —

ఐతే రష్యాలోవలె నూత్న సామ్రాజ్యవాదమునకు, జర్మనీలోవలె మిలిటరీ తత్వమునకు దారితీయు 'శక్తుల' కలయికను నిరోధించుచున్నది భారత జాతీయ విప్లవం.

జాతీయత, సామ్యవాదములను ప్రజాతంత్రమును, అహింసతో పెనవేయాలనే గాంధీజీ ఆశయం ఇది ఉదాత్తమైన అభివృద్ధి పథము. ప్రజాతంత్రసంరక్షకులమని కత్తిగట్టినామన్న బ్రిటన్, అమెరికాలు అదే ప్రజాతంత్రమును పతిత జాతులకు ప్రసాదింప నిరాకరిస్తున్న యీనాడు, గాంధీజీ చూపు మార్గము వుదాత్తముగాదా?

2. మనం జాతీయతా ప్రాధాన్యతను గుర్తించుతాం ఐతే అంతర్జాతీయతతో అవినాభావ సంబంధం నెరపుతుంది భారతజాతీయత. అంతర్జాతీయ బాధ్యతలను నిర్వహించుటకు అనుగుణ్యముగ జాతీయతను సేవించు మార్గమును నెహ్రూ గాంధీజీలు చూపుతున్నారు

బ్రిటన్, అమెరికాలు జపానుకు యుద్ధసామగ్రిని అందజేయుచున్న సమయమందే, భారత దేశం చైనా పక్షము వహించి, చైనా ధర్మయుద్ధమును బలపరచి, జపాను వస్తు బహిష్కరణోద్యమమును ప్రారంభించింది. స్పెయిన్లో ఫ్రాంకోకు అనుకూలమగు 'మడిగట్టుకొని కూర్చుండుట' బ్రిటన్, ఫ్రాన్సుల పాలసీకి రష్యా తలయొగ్గి నామమాత్రపు సాయము నే స్పెయిన్ ప్రజాతంత్ర వాదులకు చేస్తున్న సమయమందే, భారతదేశం నుండి ఆనాడే స్పానిష్ ప్రజాతంత్ర వీరులకు ఆహార పదార్థములను పంపించుట అబిసీనియా దురాక్రమణను గడంగిన ఇటలీపై ఆర్థిక బహిష్కరణాస్త్రమును ప్రయోగించుటయేమి ఇంగ్లండ్, ఫ్రాన్సు, రష్యాలు తటపటాయిస్తూండగనే, ఆర్థిక బహిష్కరణమును కట్టుదిట్టముగా అమలు జరుపవలెనని భారతదేశం పట్టుబట్టింది. అబిసీనియా స్వాతంత్ర్య హరణమును గుర్తిస్తూ అధికార ముద్రవేసిన నానా జాతి సమితి విధానమును, రష్యా ఆమోదించింది మంచూరియాను జపాన్ ఆక్రమించుకొనుటను కూడ గుర్తించింది. కాని భారతదేశము దురహంకార పూరిత జాతీయ తత్వమును నిరసించిన రవీంద్రుని వైఖరిని అనుసరిస్తూ గీతాంజలిలో అభివర్ణించిన విశ్వమానవ సౌభ్రాతృత్వమును సేవించుచున్నది

గాంధీజీ, నెహ్రూలు ఆచరణయందు కష్టమైన అంతర్జాతీయతను బోధించు ఆదర్శ అంతర్జాతీయవాదులు. ప్రప్రథమంగా భారతదేశపు శృంఖలాలను త్రెంచాలని వారు ఆశిస్తారు. ఐతే వారు సాధించే భారత స్వాతంత్ర్యమును, సోదర దళిత దేశాల స్వరాజ్య సముపార్జనకు సోపానముగనే వారెంచుతారు.

సమయమునుచూచి ప్రపంచరాజ్య సంస్థాపనకు సర్వశక్తుల నొడ్డిపోరాడాలనే వారి ఆశయం, కాన రష్యా అంతర్జాతీయత కన్న ఈ నాయకు లిర్వురు సూచించు అంతర్జాతీయ పథకమే ఉదాత్తమై, రాజకీయజ్ఞత్వముతో కూడుకున్నదై ఆదరణ యుక్తమైన అంతర్జాతీయ పథకము అనుట నిస్సందేహము.

3. యుద్ధముల స్వభావము, వాటి మూలకారణములను గుర్తించి, అంతర్జాతీయ సౌభ్రాతృత్వమును, "మంచిగా వుంటూ, మంచినే ఆశిస్తుండు" అను బుద్ధుని నీతిబోధను ప్రచార పరమయ్యే కాంగ్రెసు ఆశయము. ఆర్థిక కారణముల వల్లనే యుద్ధములు సంభవిస్తున్నాయనే వాదమును గాంధీజీ అంగీకరించడు. యజమానుల దోపిడీవిధానమునకు స్వస్తివాచకము పాడి, శ్రామిక విప్లవము ద్వారా కార్మిక నియంతృత్వమును నెలకొల్పటంతో, యుద్ధాలు తొలగిపోతాయని కమ్యూనిస్టుల విశ్వాసం. యుద్ధాలకు ఆర్థికకారణములు తొలగించాలన్నా అన్నిటికీమూలమైన ఆర్థిక దోపిడీ నంతమొందించాలి గదా! గాంధీజీ చాటినట్లు రైతులను పారిశ్రామిక ప్రజలు, పతిత దేశాలను సామ్రాజ్యదేశాలు చేస్తున్న 'మూలదోపిడీని' తుద ముట్టించాలిగదా?

దీనికితోడు, గాంధీజీ క్రమశిక్షణను ప్రబోధిస్తున్నాడు. యుద్ధవ్యామోహమునుండి ప్రజాహృదయమును మరల్చి, శాంతిపథమునకువారినాకర్షించు క్రమశిక్షణను ప్రబోధిస్తున్నాడు. సాంఘిక జీవనము నీరీతి శాస్త్రీయనియమబద్ధము చేయుట ఆధ్యాత్మికమగునో, గాంధీజీ వుత్తమ ఆధ్యాత్మికవాది యన్నమాటే.

ప్రపంచ సమస్యల పరిష్కారమునకు గాంధేయ పథానుసరణమువల్ల లాభమే చేకూరును. యుద్ధాలతో విసిగి వేసారిన ప్రజలకు బౌద్ధుని శాంతి సందేశము యెట్లు సహనత్వము, సమానత్వముల సేవనమునకు తోడయ్యేనో అట్లే వైషమ్య పరిస్థితులకు లోనౌతున్న నేటి ప్రపంచప్రజానీకమునకు సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించు గాంధేయ సందేశము ఆశాజ్యోతియైయున్నది.

4. వర్గపోరాటమును ప్రపంచదృష్టికి తొలుదొల్త మార్క్సు తీసుకు వచ్చాడు. ఈవర్గ సంఘర్షణ వునికిని గాంధీజీ గుర్తించక పోలేదు. విప్లవము ద్వారా వర్గసంఘర్షణనంత మొందించి, వర్గరహిత సమాజమును నిర్మించుటే యిరువురి ఆశయం. ఐతే మార్క్సు హింసాత్మకముగ విప్లవము నడవాలని ఆశిస్తే, గాంధీజీ అహింసాత్మక విప్లవము సాగించాలంటాడు. ప్రపంచంలో పలుచోట్ల హింస, హింసాత్మక విప్లవాలు విఫలమైనాయి. లేదా స్థిరత్వ మందలేదు?

అహింసా సత్ఫలితముల కోసంగను స్వరాజ్యోద్యమము. పతిత ప్రజల కందు బాటులోవున్న, ఆ స్త్రీలకు [illegible] నిరాశా భావముతో నిండి యున్న భారత దేశాన్ని, విప్లవ జాతిగ మార్చింది అహింస. అహింసాత్మక విప్లవ సాధనముకు నిర్మాణాత్మకమైన పరిశోధనల సాగిస్తున్న దీనాడు భారత దేశం ఈ ప్రయత్నమును ప్రతిఘటించుట విప్లవ వ్యాప్తిమాత్రమే మనక తప్పదు.

5. కార్మిక విప్లవము ధనిక వాదమును సమూలముగ త్రుంచి, కార్మిక నియంతృత్వమును నెలకొల్పుతుందని మార్క్సు సూత్రీకరించాడు.

గాంధీజీ, నెహ్రూ, వారి సహచరులు చారిత్రాత్మక శక్తులను విశాల దృష్టితో పరికించి, కార్మికులే గాక, రైతులు, కార్మికులు, విజ్ఞాన యోధులు గూడ తమ విప్లవపాత్రను నిర్వహించి సమగ్రమైన విప్లవమును సాధించాలనీ కార్మిక నియంతృత్వము గాక, ప్రజాతంత్ర రైతుకూలీ ప్రజారాజ్యమే తారక మనీ విశదపరచారు.

6 రైతుల విప్లవశక్తిని గాంధీజీ గుర్తించాడు. కాని మార్క్సు గుర్తించలేదు.

రైతులను సాంఘిక విప్లవ వీరులుగ తయారు చేయుటకు గాంధీజీ పూనుకున్నాడు. మాబోంట్లకు ప్రోత్సాహమిచ్చి, రైతాంగ విప్లవ సిద్ధాంత ములను రూపొందించుటకు, పెంపొందించుటకు రైతాంగ సంఘటనను వృద్ధిపర చుటకు దోహద మిచ్చాడు గాంధీజీ. రైతులను సంఘటిత పరచి, వారికి విప్లవ శిక్షణ నొసంగుటలో యితర ప్రపంచముకు భారతదేశం మార్గదర్శియైంది.

7. భారతదేశము తదితర పతిత దేశాలు యింకను పరిణామదశలోనే వున్నాయి. ఆయా దేశాలింకను తమ జాతీయ స్వాతంత్ర్యమునే సాధించుకో వలసియున్నది. దీనికితోడు ధనికవాద దంష్ట్రలకు గురిగాకుండా స్వరక్షణ ప్రయత్నములు పెంపొందించుకుంటూండవలసియున్నది. స్వాతంత్ర్యము సాధించుట తోడనే, ఆయా దేశముల రైతు, కూలీ, ప్రజావర్గాలు సోషలిస్టు పథమున పురోగమించ వలసియున్నది. భారతదేశంలో, సాంఘిక, విప్లవ సిద్ధాంతముల పెంపునకు అద్వితీయమైన అవకాశాలేర్పడ్డాయి. గాంధీజీ జాతీయ పథమునుండి సోషలిస్టు పథమున ముందుగ వేస్తూండగ, సోషలిస్టులు జాతీయత నాలింగన చేసుకొంటున్నారు. లెనిన్ పరిభాషలో, ఈరెంటికలయిక "రెండుగొప్ప అభ్యుదయ శక్తుల సుఖసంధానము. దీనికి మేలిమి మెరుగు నిస్తాయి గాంధీజీ సూచించు ప్రజాతంత్రము, అహింసలు.

8. నేటి భారత రాజకీయాలు 1920 నాటి రాజకీయాల వలె వున్నాయి. గోఖలే ఆచరణీయ రాజకీయములు, తిలక్ మహాశయుని విప్లవజాతీయత, వివేకానందుని వ్యక్తిగత వేదాంత తత్వములను నాడు సమన్వయ పరచింది గాంధీయం. రాజకీయంగా అట్లే యీనాడు నెహ్రూ సామ్యవాదము, రైతు కూలీ విప్లవ ధర్మములను గాంధీయం పక్షమున సమన్వయంగా జరుగుతున్నది. నాటి రాజకీయ, ఆధ్యాత్మిక శక్తుల కలయిక విప్లవయుగము (1920—40)కు ఏట్లు దారి తీసెనో, అట్లే యీనాటి విప్లవ సమైక్యత అఖండ విప్లవ విజయమునకు మార్గదర్శక మౌతుందని ఆశించగలము.

1920లో —ఆంగ్ల మానవసత్వ పూజితులైన సురేంద్రనాథ బెనర్జీ, అనీ బిసెంట్, బిపిన్ చంద్రపాల్, శ్రీనివాసశాస్త్రి ప్రభృతులెట్లు నూతన విప్లవయుగ వాతావరణములో నిలువలేక జారిపోయారు. అదేవిధంగా యీనాడు రష్యన్ మానవపుత్రులను గూడ మహత్తర జాతీయ విప్లవ వీచికలు వెనుకకునెట్టి వేసినాయి. దీనికంతకు కారణం నూతన జాతీయ విప్లవవాతావరణమునకు వారు యెరుగమి చే.

ఐతే ఆనాటి అభివృద్ధి నిరోధకులైన మితవాదులకు, యీనాటి విప్లవ వ్యాఘాతుకులైన కమ్యూనిస్టులకు ఒకగొప్ప తారతమ్యమున్నది. వారివలె యీనాడు కమ్యూనిస్టులు, రాజకీయ ప్రభుత్వ పదవులకో ధనాశకో లోనయ్యారు. అందరు జాతీయ ధర్మమును నిర్వర్తించక ద్రోహము చేశారు. ఐతే మితవాదులు ఒక్క ఇంగ్లండునే సేవిస్తే, కమ్యూనిస్టులు బ్రిటన్, రష్యాలను గూడ సేవించారు. మితవాదులు ప్రజాసామాన్యంతో సంబంధం పెట్టుకోలేదు. కాని కమ్యూనిస్టులు కమ్యూనిస్టులు శాస్త్రీయ సిద్ధాంతము, పేరుతో ప్రజాసామాన్యంతో సన్నిహిత సంబంధం నెరపు జూస్తారు. నిర్మాణ కార్యక్రమము విప్లవాచర్యల ద్వారా మితవాదులను మించి, ప్రజావిశ్వాసాభిమానములను గాంధీజీ, యితర జాతీయ విప్లవవాదులు చూరగొన్నారు. అదే విధంగా యీనాడు గాంధి, నెహ్రూ నాయకత్వమున, రైతు, కూలీ, ప్రజావర్గసంస్థలతో దాపటుతో, విప్లవాత్మక కార్యక్రమంతో, భారత జాతీయ విప్లవవాదులు కమ్యూనిస్టుల దిగమింగారు. సంపూర్ణ విజయమును సాధించు ఆత్మవిశ్వాసం వారికి వుంది. దీనికితోడు 1942—45 పోరాటం కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమము, సిద్ధాంతముల బండారమును, బూటక ప్రజాతీయభక్తిని బట్టబయలు చేసింది. ఆదే విప్లవ పోరాటం. మరొకవంక గాంధి, నెహ్రూజీల జాతీయతా సామ్యవాదముల సుఖసమైక్యతను సాధించింది.

# దేశి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1 | రైతులు కమ్యూనిస్టులు (రంగా) | 1- 8- |
| 2 | గాంధీ ప్రణాళిక (అగర్ వాలా) | 1-1-0 |
| 3 | గాంధీ రాజ్యాంగం ,, | 1- 8-0 |
| 4 | పాకిస్థాన్ (రంగా) | 0- 8-( |
| 5 | విద్యార్థుల నిర్మాణకార్యక్రమం (అగర్ వాలా) | 0- |
| 6 | నిర్మాణకార్యక్రమం (గాంధీ, రాజేంద్రప్రసాదులు) | 0- |
| 7 | కాంగ్రెసు-కే-మీ ఓటు | 0-1 |